# ముఖచిత్రం


షేక్ రహ్మాత్ అలి

కనుమరుగవుతున్న కొన్ని విశేష వన్య మృగాలను వినోదం కోసం వేటాడటం, క్షణికానందం కోసం భగవంతుడు ప్రసాదించిన అపార సృష్టి సంపదను నాశనం చెయ్యడం మనిషికి అనాదిగా అలవాటైంది. ఈమధ్య బొంబాయికి చెందిన ఓ నటుడు 'బ్లాక్‌బక్' లాంటి క్షీణ దశలో ఉన్న విశేష జాతికి చెందిన రెండు జింకలను తన తోటి హీరోయిన్‌ల సరదా తీర్చేందుకు కాల్చి చంపి చట్టపు చిక్కుల్లో యిరుక్కున్న విషయము అందరికీ తెల్సిందే.

ఈ ముఖ చిత్రంలో ఉన్న జింకజాతికి చెందిన 'వాపితి' అలాంటి ఉన్మాదుల బారినపడి క్షీణించి నశించింది (extinct). వాపితి - నార్త్ అమెరికాలోని బయలు మైదానాలకు చెందినది. ఈ మేలురకపు జింక రూపురేఖలు యూరోప్‌కు చెందిన 'రెడ్ డీర్' కు అతిదగ్గరగా ఉంటాయి. కాని ఇది ఆకారంలో రెడ్ డీర్ కన్నా చాలా పెద్దది. దీని ఎత్తు (భూజాలదాకా) 6 అడుగులు వరకు ఉండి, చూడడానికి హుందాగా, ఆకర్షణీయంగా ఉండేది. రుచికరమైన దీని మాంసము, రకరకాల దుస్తులకుపయోగపడే దీని చర్మం, వీటిని మించి దీని పై దవడలోని విలువైన కోరపన్ను వీటి కోసం దీనిని వేటాడుతారు. ఆవిధంగా ఇది అంతరించింది.

ఈ మేలుజాతికి చెందిన ఒకే ఒక ఆఖరి జింకను 1877 సెప్టెంబరు 1వ తేదీన పెన్‌సిల్వేనియాలో జిమ్‌జాకబ్‌సన్ అనే పేరుమోసిన వేటగాడు కాల్చి చంపాడు. దానితో 'వాపితి' లాంటి అందమైన, అరుదైన జింకజాతి నశించిపోయింది.

★ ఈ చిత్రంలోని 'బ్యాక్‌గ్రౌండ్' ఊహాజనితం. అది ఈ జాతి జింక నివాసప్రాంతానికి సంబంధించినదికాదు.

## చిత్రకారుడు :

షేక్ రహ్మాత్ అలి, మిసిమి పాఠకులకు సుపరిచితుడు. పొలిటికల్ సైన్స్ డిగ్రీ, ఫైన్ ఆర్ట్స్ (JNTU) డిప్లొమా, 20 సంవత్సరాలకు మించిన కళానుభవం ఈయన యోగ్యతలు. "Contemporary Paintings' ఈయనకు అర్థముకాని విషయం. కళాప్రదర్శనలపై కుతూహలంలేదు. 'నా క్లయింట్సే నా కళా ప్రదర్శకు 'లంటాడు ఈయన పెయింటింగ్స్ సృష్టికి అతి దగ్గరగా ఉండి జీవంపోసుకుంటాయి. దేశ విదేశాల్లో ఈయన పెయింటింగ్స్ పెక్కు ప్రైవేట్ కలెక్షన్లలో ఉన్నాయి జన్మస్థలం అర్ధవీడు, ప్రకాశం జిల్లా. నివాసం హైదరాబాదు.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**


సంపుటి 10 | నవంబర్ 1998 | సంచిక 11

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**


## విషయసూచిక




విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/-


ముఖచిత్రం : *అంతరించి పోయిన* **'వాపితి'**

---


**Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,**
**1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# మిసిమి వ్యవస్థాపక సంపాదకులు
# డా॥ ఆలపాటి రవీంద్రనాథ్‌గారి జన్మదినం

**(జననం: 1922 నవంబరు 4 – మరణం 1996 ఫిబ్రవరి 11)**

ప్రతి వ్యక్తికీ నాలుగు ప్రాథమిక వాంఛలుంటాయని మనో విజ్ఞాన శాస్త్రవేత్తలు తేల్చారు. అవి : గుర్తింపు కోసం తహతహ (Craving for recognition), కొత్త అనుభవాలు (Novelty of experience) భద్రత (Security), ప్రతిస్పందన (Response) వీటిల్లో మొదటిది ఆత్మాభివ్యక్తీకరణ (Self expression) కంటే వేరుకాదు. ఈ గుర్తింపులో భాగంగానే ఆయన పూర్వం తెనాలిలో జాకోబిన్ పబ్లిషర్స్ స్థాపించిందీ, జ్యోతి ప్రెస్ వ్యవస్థాపించిందీ, రేరాణి, కినిమా, జ్యోతి పత్రికలు నడిపిందీనూ.

> డా॥ ఆలపాటిగారి 'జీవనరేఖలు' వెలువరించాలని ఆలోచిస్తున్నాం. ఈ ప్రయత్నంలోనే చాలామందికి లేఖలు రాయడం జరిగింది.
>
> రవీంద్రనాథ్‌గారితో వ్యక్తిగత సంబంధాలున్న, మరేవిధంగానైనా ఎరిగివున్నా, వారంతా, వారితో తాము పంచుకున్న అనుభవాలను రాసి పంపవలసిందిగా మనవి. వారి ఫొటోగ్రాఫ్‌లు, వారితో కలిసి తీయించుకొన్న ఫొటోగ్రాఫ్‌లు ఉంటే

పత్రికా రంగంలో ఆయన తనదైన ముద్రను వేశారు. ఆనాడు ఎవరూ ఊహించలేని విధంగా ఎలెన్‌రాయ్ రాసిన 'కుటుంబ నియంత్రణ'ను ప్రచురించి ప్రభుత్వ ఆగ్రహానికి గురయ్యారు. ఎవలాక్ ఎలిస్ 'Sex' గ్రంథాన్ని అనువదింపజేసి, సెక్స్‌ను బూతుగా పరిగణించే ఆరోజుల్లోనే, ప్రచురించారు. రేడియోను రివ్యూ చేయడం గూడా ఆయనే ప్రారంభించారు. ఇన్నిరకాలుగా ప్రథముడు ఆయన.

అంతే ముందుచూపుతో 1990లో 'మిసిమి' మాస పత్రికను ప్రారంభించారు. ఇది పత్రికా రంగంలో విలక్షణమైన పత్రిక. ఇది సీరియస్ రీడర్స్‌ను సీరియస్‌గా సంతృప్తం చేసే పత్రిక. చెణుకులు, రాజకీయం, సినిమా, క్రికెట్, రస కథ, గేయం, సెక్స్ లేకుండా నడిచే పత్రిక. కేవలం కళ, సాహిత్యం, సంస్కృతి, విమర్శ, తాత్విక శాస్త్ర విషయాలతో నడిచే పత్రిక. ఇది ఆయన కలల పంట. ఆయన కలల కనుగుణంగా నడుపుతున్నాం. ఈ పత్రికను గురించి 1993లో 'ది హిందూ' దినపత్రిక విశిష్ట పత్రికగా ప్రశంసించింది. 1992లో ఆంధ్రభూమి దిన పత్రిక 'మిసిమి' ప్రత్యేకత గురించి సంపాదకీయం రాసింది. 1995లో 'మహానగర్' దిన పత్రిక 'మిసిమి' వైలక్షణ్యాన్ని గురించి సంపాదకీయం రాసింది.

పాఠకుల ప్రతిస్పందననుబట్టి పత్రికకు ఆదరణ బాగానే ఉందని బావిస్తున్నాం. సూచనలను స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాం.

రవీంద్రనాథ్‌గారి 76వ జయంతి సభ తెనాలి కవిరాజు భవన్‌లో జరుగుతుంది.
దాశరథి రంగాచార్యులు ఉపన్యసిస్తారు. అందరు ఆహ్వానితులే

–సంపాదకుడు

# జాఁ-పాల్ సార్త్ర

(1964 నోబెల్ సాహిత్య బహుమతి తిరస్కారం)

ప్రసంగం : అనువాదం:
(స్వీడిష్ అకాడెమీ సభ్యుడు ఏండర్స్ ఆసర్‌లింగ్ ద్వారా) - యస్. ఎ. మహమ్మద్

ఈ సంవత్సరం స్వీడిష్ అకాడెమీ నోబెల్ సాహిత్య పురస్కారాన్ని

''సుసంపన్నమైన భావాలతో, స్వతంత్ర్య కాంక్ష భరితమై, సత్య శోధనతో మన యుగంపై గొప్ప ప్రభావాన్ని చూపిన రచనలు చేసినందుకు'' ఫ్రెంచి రచయిత జాఁ-పాసార్త్రకు మంజూరు చేసింది.

ఈ సందర్భంగా, ఈ బహుమానాన్ని స్వీకరించేందుకు సుముఖంగా లేనని సార్త్ర తెలియజేసిన విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవాలి. ఈ గౌరవాన్ని సార్త్ర తిరస్కరించిన కారణాన-ఈపురస్కార ప్రాధాన్యత ఏమాత్రం వికృతీకరించబడదు. ఈ పరిస్థితులలో, బహుమతి ప్రదానోత్సవం జరగదని మాత్రమే అకాడెమీ పేర్కొనగలదు.

**తిరస్కారం**

Le Figaro, October 23,1964 ప్రతిలో ప్రచురితమైన ఒక బహిరంగ ప్రకటనలో సార్త్ర తానీపురస్కారాన్ని తిరస్కరించడం వివాదం కావడం పట్ల విచారాన్ని వ్యక్తంచేశారు. స్వీడిష్ అకాడెమి ఒకసారి తీసుకున్న నిర్ణయపు అనుక్రమణీయత తెలియని కారణాన, తనను ఈ బహుమానానికి ఎన్నుకోవలదని ఒకలేఖ ద్వారా స్వీడిష్ అకాడెమిని కోరినట్లు సర్వులకు తెలియాలని సార్త్ర అభిలషించారు. తనకు స్వీడిష్ అకాడెమీని కించపరిచే ఉద్దేశ్యం లేదని, తన నిరాకరణ ఆత్మగత, ఇతరేతర కారణాల ప్రేరితం అని సార్త్ర ఈ లేఖలోనే సూచించారు.

ఆత్మగతకారణాలకు సంబంధించి, రచయిత కర్తవ్యం గురించి తనకున్న భావన మూలంగా తానెప్పుడూ అధికారిక పురస్కారాలను తిరస్కరిస్తూనే వచ్చానని సార్త్ర పేర్కొన్నారు. కాబట్టి ఈ విధంగా బహుమానాన్ని నిరాకరించడం ప్రథమం కాదు. గతంలో కూడా సార్త్ర Legion of Honeur లో సభ్యత్వాన్ని నిరాకరించి College de France ప్రవేశాన్ని అభిలషించలేదు. అంతే కాదు, Lenim Prize ను తనకివ్వజూపినా, దాన్నికూడ తిరస్కరిస్తానని సార్త్ర అన్నారు. ఈ విధమైన గౌరవాన్ని ఆమోదించడం, రచయిత తన వ్యక్తిగత పూచీలను, బాధ్యతలను బహుమతి ప్రధానం చేసిన వ్యవస్థతో సహచారితం చేయడమే. రచయిత ఎటువంటి పరిస్థితులలో కూడా తను తాను ఒక వ్యవస్థగా పరివర్తన చెందేందుకు అనుమతించకూడదు. ఇతర కారణాలకు సంబంధించి సార్త్ర ఒక పట్టికనిచ్చారు. ఏ వ్యవస్థల జోక్యం లేకుండా ప్రాక్పశ్చిమాల ప్రజల మధ్య, సంస్కృతుల మధ్య ఆదాన ప్రదానాలు జరగాలని తన నమ్మిక అని సార్త్రా పేర్కొన్నారు.

అంతేకాదు, తన అభిప్రాయంతో, గతంలో ఈ పురస్కారం అన్ని భావజాలాలకు, అన్ని జాతులకు సమాన ప్రాతినిధ్యం వహించలేదు. ఇటువంటి స్థితిలో తానీ బహుమానాన్ని ఆమోదించడం, అవాంఛనీయ, అన్యాయపూరిత విమర్శలకు తావియ్యవచ్చు అని ఆయనన్నారు.

స్వీడిష్ అకాడెమీకి ఒక ప్రేమ పూర్వక సందేశంతో సార్త్ర తన లేఖను ముగించారు.

తరువాత జరిగిన విందుసభలో Caroline Institute, రెక్టర్ యస్. ఫ్రి బర్గ్ ఈ క్రింది వ్యాఖ్యలు చేశారు.

సార్త్ర ఈ సంవత్సరపు బహుమతిని స్వీకరించేందుకు తన అశక్తతను వ్యక్తపరిచారు. ఈ పురస్కారానికి సంబంధించి ప్రతిమారు చర్చ జరుగుతునే ఉంది. ప్రతివ్యక్తి తనే న్యాయనిర్ణేత కాగల అర్హత ఉన్నట్లు భావించి, ఎంపిక ఔచిత్యం తనకు బోధపడని సందర్భంలో విమర్శించడం జరుగుతునే ఉంది. నోబెల్ అయితే ఈ సంవత్సరపు ఎంపికను సరిగా అర్థం చేసుకుని ఉండేవారు.

లోకోద్ధరణే ప్రతియుగం లోను మనిషి కాంచిన స్వప్నం. ఏకవి, లేక శాస్త్రకారుని విషయంలో ఇది మరింత నిజం. శాస్త్రవేత్త ప్రాధాన్యతకు ఇదొక కొలమానం. ఇదే సార్త్ర స్ఫూర్తికి మూలాధారం, బలం. యుద్ధానంతర సాహిత్య, మేధోచర్చలో కేంద్రక బిందువైన సార్త్ర - ప్రశంశించబడ్డాడు, చర్చించబడ్డాడు, విమర్శకు గురి అయ్యాడు. విస్ఫోట నాత్మకమైన సార్త్ర రచనల సమగ్రరూపంలో ఒక సందేశపు బరువు ఉంది. పాఠకుడిని, విశాల దృష్టిలో ప్రపంచాన్ని ఉద్ధరించాలనే ఒక గంభీర ప్రయాసతో ఇది నిలిచి ఉంది. సార్త్ర రచనలు ప్రతిఫ లించిన తత్వాన్ని ఒక విమోచనగా యువత కొనియాడింది. వ్యక్తి తాను పొందగలనని ఆశించే ప్రమోద పరిమాణం, అతను నివసించే పరిస్థితులు, విలువల మధ్య తన స్థానాన్ని తదనంతర ఫలితాలను ఆమోదించడంపై నిర్ధారితమౌతుంది. అన్న అర్థంలో మనం సార్త్ర అస్తిత్వవాదాన్ని గ్రాహ్యం చేసుకోవచ్చు. ఇది సరళవ్యాఖ్యానమే. దీన్నే నోబెల్ సమకాలికుడు, ఆర్. డబ్ల్యు. ఎమర్సన్ ప్రశస్తంగా వ్యక్తీకరించాడు.

''అంతిమంగా, నీ అంతరంగపు పరిపూర్ణత కంటే
మించి పవిత్రమైన దేదీలేదు.''

మానవ జీవన ప్రమాణం బాహిరమైన స్థితిగతులతో పాటు వైయక్తికానందం పైకూడ ఆధారపడి ఉంటుంది. ప్రమాణీకరణల సంక్లిష్ట సాంఘిక విధానాల మన యుగంలో మనిషికి జీవిత పరమోద్దేశం ఇంకా చేజారలేదు కాని తప్పకుండా మందగించింది. నోబెల్ తన కాలంలో అత్యవసరంగా నిలిపిన ఈ ఆదర్శాలను అంతే అత్యవసరంగా నిలిపి ఉంచడం మనందరి కర్తవ్యం.

## WHAT IS BEHIND INDIAN HISTORY?

Throughout the pages of Indian history, I find a great purpose unfolding itself. Movement after movement has swept over this vast country, apparently creating hostile, forces, but in reality stimulating the vitality and moulding the life of the people into one great nationality. If the Aryans and the non-Aryans met, it was for the purpose of making one people out of them, Brahmanism with its great culture succeeded in binding the whole of India and was indeed a mighty unifying force. Buddhism with its protests against Bhramanism served the same great historical purpose; and from Magadha to Texila was one great Buddhistic empire which succeeded not only in broadening the basis of Indian unity but in creating what is perhaps not less important important, the greater India beyond the Himalayas and beyond the seas.

- C.R.Das in his Presidential address the Gaya Congress Session in 1922.

హెరాల్డ్ విల్సన్ సృష్టించిన మరో గొప్ప గ్రంథం

# విజ్ఞాన సమన్వయం

– ఇన్నయ్య

ఒకప్పుడు తన సామాజిక సిద్ధాంతాలతో ప్రపంచాన్ని కలవరపెట్టి, ఉగ్రూతలూగించిన ఎడ్వర్డ్ విల్సన్ నేడు కొత్త ఆలోచనలతో మళ్ళీ ప్రకోపింపజేస్తున్నాడు. మనకు విభిన్నంగా, విరుద్ధంగా కనిపించేవాటి మధ్య సమన్వయం సాధ్యమంటున్నాడు. అన్నింటికీ పరిష్కారం జీవశాస్త్రంలో చూడొచ్చు అంటున్నాడు. ఇందుకు ఆయన స్వీకరించిన పరిశోధన చీమలు!

చీమలకు మెదడులో 10 లక్షల కణాలేవున్నాయి. మనిషి మెదడులో వంద బిలియన్ కణాలున్నాయి. చీమల ప్రవర్తన, క్రమబద్ధత సాధ్యమైనప్పుడు మనిషి తనశక్తిని వినియోగిస్తే ఇంకెంతో సాధించగలడని విల్సన్ సిద్ధాంతీకరిస్తున్నాడు.

అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో పరిశోధనలుచేస్తున్న విల్సన్ ప్రస్తుతం 68వ పడిలోవున్నాడు. ఆయన పరిశోధనాలయంలో 538000 చీమల నమూనాలు, వర్గీకరణ నిమిత్తం సారాయిలో పెట్టి వుంచిన మరో 3 లక్షల చీమలు చూచేవారికి ఆశ్చర్యం వేస్తుంది. చిన్నప్పటి నుండే అలబామా రాష్ట్రం అడవులలో చీమల్ని సేకరించి, ప్రకృతిని అధ్యయనం చేసిన విల్సన్ పులిట్జర్ బహుమానం అందుకున్న రచయిత.

మన ప్రవర్తన మన తల్లిదండ్రుల జన్యు కణాలనుండి సంక్రమించిందని, వారి శిక్షణ నుండి పిల్లలు పుణికి పుచ్చుకుంటారని సిద్ధాంతీకరిస్తూ ''సోషియోబయాలజీ'' రాసినప్పుడు చాలామంది గగ్గోలు పెట్టారు. రాను రాను విల్సన్ సోషియోలజీని సీరియస్‌గా స్వీకరించి పరిశీలిస్తున్నారు.

నేడు జీవ కణశాస్త్రం, ప్రకృతి శాస్త్రం, జీవకణశాస్త్రం ఎన్నో సూక్ష్మాలు అందిస్తున్నది. కనుక మెదడు ఆలోచనా స్రవంతి లోతుపాతుల్లోకి పోగలమని విల్సన్ అంటున్నాడు.

సిద్ధాంతాలకు, నమ్మకాలకు బానిసలుగా బ్రతకడంకాదు, ఉన్నతస్థాయికి ఎదుగుతూ పోవడం మానవ లక్షణాలలో విశిష్టమైనదని విల్సన్ గట్టిగా చెబుతున్నాడు.

మనకు శాస్త్రాల వలన జ్ఞానం విపరీతంగా వస్తున్నది. దీని ఫలితంగా వివిధ జ్ఞాన శాఖల్ని సమన్వయీకరించి చూచుకోవలసిన అవసరం కలిగిందంటున్నాడు.

హెరాల్డ్ విల్సన్ 7వ ఏట మిలటరీ స్కూలులో చేరి చదివాడు. ఒక దుర్ఘటనలో ఒక కన్నుకనిపించకుండా పోయింది. పుట్టినప్పటినుండీ చెముడు వచ్చింది. విల్సన్ ఒక్కడే సంతానమైనా తల్లిదండ్రులు విడాకులు యిచ్చుకున్నందున, చిన్నప్పటినుండీ కష్టజీవితానికి అలవాటు పడ్డాడు. హార్వర్డ్ యూనివర్శిటీలో చేరిన తరువాత, జీవ శాస్త్రాన్ని యితర రంగాలకు అన్వయించవచ్చుని గ్రహించాడు. సమన్వయం అతడి వూపిరిగా మారింది.

శ్రీలంక వరకూ పర్యటించి, చీమల నమూనాలు సేకరించి పరిశోధించిన విల్సన్, వాటిపై ప్రామాణీకరించిన శాస్త్రజ్ఞుడయ్యాడు. అది మూలంగా పెట్టుకొని, ఇతర జీవజాలమంతా పరిశీలించాడు. క్రమేణా మనిషికి కూడా విస్తరించాడు. దీనిఫలితంగా 1978లో ''ఆన్ హ్యూమన్ నేచర్'' ప్రచురించాడు.

మనిషి పరిణామంలో భాగం. తన జన్యుకణాల ప్రభావంతో అతడు ప్రవర్తిస్తుంటాడు. భవిష్యత్తులోకి తొంగి చూస్తుంటాడు. ఒకప్పుడు మనిషి మాజిక్ ద్వారా తన జ్ఞానాన్ని అదుపులో పెట్టాలనుకున్నాడు. నేడు కళల ద్వారా వివిధ గందరగోళాలను శాస్త్రాలను సమన్వయీకరించే ప్రయత్నం చేస్తున్నాడు. ఇది విల్సన్ సిద్ధాంతం.

క్రైస్తవ మతంలో పుట్టిపెరిగిన విల్సన్ అందులోనుండి మానవ వాదిగా ఎదిగాడు. ప్రకృతిలోని వైవిధ్యాన్ని అభినందించసాగాడు. పరిణామం సాగిపోతూ వున్నదన్నాడు. ఇందుకు మానవుడు ఇంకా ప్రయోజనాత్మకంగా దోహదం చేయాలంటే, వివిధ రీతుల్ని బాగా అవగాహన చేసుకోవాలన్నాడు అటు ప్రకృతి, యిటు జన్యు కణాల వలన మానవుడు మసలుకుంటున్నాడు. వీటిని సమన్వయించాలంటున్నాడు. పరిసరాలను ధ్వంసం చేయకుండా జీవనం కొనసాగించడం అవసరమంటాడు.

విల్సన్ భార్య ఇర్నె (Irene) అతడికి బాగా సహకరిస్తుంది.

ప్రస్తుతం విల్సన్ రాసి ప్రచురించిన కొత్త పుస్తకం మళ్ళీ విజ్ఞాన ప్రపంచాన్ని ఆలోచింపజేస్తున్నది. జ్ఞాన సమన్వయీకరణ యీ గ్రంథానికి మూలం (Consilience: The Unity of Knowledge)

ఒకవైపు విజ్ఞాన రంగం ఎంతో సాధించగా, మరొక పక్క దీనిని ఖండిస్తూ యీసడిస్తూ కొందరు ప్రచారం చేస్తున్నారు. అతీంద్రియ శక్తులు, దివ్యత్వం, మహిమల పేరిట కొందరు రంగంలోకి దిగి మోసాలకు పాల్పడుతున్నారు. మరికొందరు మూర్ఖంగా మతగ్రంథాలలోనే సర్వస్వం వున్నదని నమ్ముతున్నారు. కాని ఇంకా కొందరు తత్వం పేరిట సిద్ధాంతీకరిస్తూ శాస్త్రాన్ని వెక్కిరిస్తున్నారు. పోస్ట్ మోడరనిస్ట్ శాఖ యిందులో ఒకటి. ఇంకా సాంస్కృతిక సాపేక్షతా వాదులున్నారు. నియోమార్క్సిస్టులు వీరికి తోడయ్యారు. ఫాయర్ బాండియన్లు, కున్ వాదులున్నారు. అలాంటి వారందరినీ దృష్టికలో పెట్టుకొని విల్సన్ కొత్తపుస్తకం రాశాడు. విజ్ఞానం సంకుచితం కాదనీ, మానవుడిని పెంచేదేకాని తగ్గించేది కాదని విల్సన్ అన్నాడు. అందుకే వివిధ విజ్ఞాన శాఖల సమన్వయం కోరుతున్నాడు.

వికాసయుగం మానవుడిని స్వేచ్ఛ వైపుకు నడిపించిన విషయం విల్సన్ గుర్తు చేస్తున్నాడు. మానవుడి పురోగతికి అత్యంత శక్తివంతమైన ఆయుధం విజ్ఞానమే.

విజ్ఞానాన్ని సమన్వయీకరించడం అవసరమనే విల్సన్ మూల సిద్ధాంతం ముఖ్యమైనది ఎవరికి వారు ప్రత్యేక కృషిచేసి, ఆయా రంగాలలో ఎన్నో కనిపెడుతున్నాడు. సాధిస్తున్నారు. కాని బయట ఏం జరుగుతున్నదో గ్రహించడంలేదు. అందువలన మూఢనమ్మకాలు, మూర్ఖత్వాలు వుంటున్నాయి. సమన్వయీకరణ జరిగితే యీ లోపం సవరించవచ్చు. కెమిస్ట్రీలో జరిగేది, జీవ శాస్త్రజ్ఞులకు, ఫిజిక్స్‌లో పరిశోధనలు, భూగర్భ శాస్త్రజ్ఞులకూ, ఖగోళంలో ఏంజరుగుతున్నదో మానసిక శాస్త్రజ్ఞులకూ తెలియాలంటే, సమన్వయీకరణ జరగాలన్న మాట. ఎవరికివారే మడిగట్టుకొని, తమదేగొప్పరంగం అనుకొంటూ, మిగిలిన రంగాలను పట్టించుకోపోవడం లోపం. ఇది తొలగాలి.

లోగడ కార్నప్, రైకన్‌బాక్, ఎం. ఎన్. రాయ్, వంటివారు యిలాంటి సమన్వయీకరణ ధోరణులు కొంత వరకు చేశారు. అలాంటి కృషి చాలా భారీ ఎత్తున యిప్పుడు జరగాలని విల్సన్ ఉద్దేశం.

విజ్ఞాన రంగంలో ఒక భాగం మరొక విభాగానికి ఎలా ఉపకరిస్తుందో శాస్త్రజ్ఞులు గ్రహిస్తున్నారు. సమన్వయీకరణలో కేవలం విజ్ఞాన శాస్త్రాలేగాక, మానవశాస్త్రాలు, సామాజిక శాస్త్రాలు చేర్చడం విల్సన్ విశిష్టత. అక్కడే వివాదం తలెత్తుతున్నది.

పరిణామంలో జన్యుకణాలు, పరిసరాలు రెండూ పరస్పరం ప్రాధాన్యత వహిస్తూ, పోతున్నాయనేది విల్సన్ మూలసిద్ధాంతం. అలాంటి సమన్వయీకరణ సాధ్యం కాదని రిచర్డ్ రోర్టీ (Richard Rorty) వాదిస్తున్నాడు. చాలాకాలం పట్టినాసరే అలాంటి సమన్వయీకరణ వైపుసాగి పోవడం అవసరమనీ, సాధ్యమనీ విల్సన్ అంటాడు.

విజ్ఞానాన్ని నీతికి సైతం అన్వయించవచ్చని విల్సన్ అంటాడు. మొత్తం మీద గొప్ప గ్రంథంరాసి విల్సన్ మళ్ళీ సంచలనం సృష్టించాడు.

# రచనా చణత్వ ముద్ర - ఆరుద్ర

- అద్దంకి శ్రీనివాస్

''మంచి రచన అంటే ఇలా ఉండాలి.

బాగా భోంచేసినట్లుండాలి.

కొంచెం బాధపడాలి, ఆ బాధలోంచి తేరుకొని బాగుపడాలి.''

ఈ నిర్వచనం ఎవరిదో కాదు శ్రీ ఆరుద్రగారిదే. 'విశ్వశ్రేయః కావ్యమ్' అని ప్రాచీనులు గట్టిగా చెప్తే, ఆరుద్ర కమనీయంగా సుతిమెత్తని పదాలతో చెప్పారు. చెప్పడమే కాదు, తన రచనల్లో ఆ శైలీ విశేషాన్ని, విలక్షణతని ప్రస్ఫుటంగా చూపించారు.

రచనే తన జీవితంగా జీవించి, జీవితాంతమూ రచనా వ్యాసంగంతోనే జీవిస్తూ భౌతికంగా మరణించినా సాహితీ జగత్తులో నిత్యస్మరణీయ సజీవ సాహితీమూర్తి ఆరుద్ర. ఆరుద్ర చేపట్టిన సాహితీ ప్రక్రియ ప్రతిదీ ఫలవంతమే అయ్యింది. అది ఆయన సాహితీవైదుష్యానికి ప్రతీక. అందరూ చెప్పినట్లుకాక, ప్రతి అభి వ్యక్తిలోనూ, తనదైన విశేషరచనా చణత్వ ముద్ర కనబరచారు. పద్యం రాసినా, పాట రాసినా, గేయం రాసినా, వ్యాసం రాసినా ఆయన రచనలలో కన్పించే లక్షణాలు స్పష్టత, సమగ్రత అందరిచేతా ' ఓహో' అనిపించే అసాధారణమైన శైలి. ఒక రచనా ధురీణునికి అంతకు మించి ఇంకేం కావాలి.....?

దాదాపు అయిదు దశాబ్దాలు సాహితీ సామ్రాజ్యాన్ని తనదంటూ ఓ ప్రత్యేకమైన తెలుగుతనం ఉట్టిపడే ముద్రతో అలరార్చింది ఆరుద్ర రచన. శ్రీ శ్రీ తర్వాత అభ్యుదయ కవితా ప్రపంచంలోకి, చాలా వేగంగా సూటిగా ప్రవేశించిన బహుముఖీన ప్రతిభామూర్తి.

భాషాశాస్త్రం, సాహిత్య చరిత్ర, చదరంగం, ఇంద్రజాలం, శాసననిర్మాణ పథకం, ఫొటోగ్రఫీ వంటి విద్యలు తెలిసిన సర్వంకష ప్రజ్ఞాశాలి. పట్టాభి నారాయణబాబు ప్రభావం వున్న అతి నవీనుడు ఆరుద్ర.

ఆంధ్ర సాహితీవనంలో ఉద్భవించిన రచనామాధుర్య సౌరభాలను చిమ్మే ఓ కమనీయ పారిజాత పుష్పం. ఆయన పరిమళం కమ్ముకోని రచనా ప్రక్రియ లేదు. ఆయన్ని మహోన్నతుని చేయని కవితా వైరుధ్యమూ లేదు.

ఒక మానవ మాత్రునిగా జీవించిన వ్యక్తి అంతటి సాహితీ కృషి చేయడం నిజంగా దుస్సాధ్యమే. తన జీవితంలో ఏ ఒక్క క్షణాన్ని చేజార్చుకోక అవిశ్రాంతంగా కృషి చేసి సమగ్రాంధ్ర సాహిత్యాన్ని ఏర్చి కూర్చి, ఆంధ్రసరస్వతికి కంఠాభరణంగా వేసిన మహనీయులు.

డిటెక్టివ్ నవలలు, కథలు, నాటికలు, వందలాది రేడియో ప్రసంగాలు 'త్వమేవాహమ్', 'సినీవాలి', 'ఇంటింటి పద్యాలు', 'కూనలమ్మ పదాలు' ఇంకా ఎన్నో గేయాలు, సినిమా పాటలు, సమగ్రాంధ్రసాహిత్యం, ఇలా ఎన్నో ఎన్నో వీరి కవితా వైదుష్యానికి నిదర్శనాలు.

**సమగ్రాంధ్ర సాహిత్యం**

ఆరుద్ర కవితా చణత్వంలోకన్నా విమర్శనాధురీణత్వంలోనే ఒకమెట్టు ఎక్కువని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. సాహిత్య చరిత్ర సర్వస్వాన్నీ సరళంగా సహేతుకంగా వచ్చిన గ్రంథం దీన్ని మించినది లేదు. సమగ్ర ఆంధ్ర సాహిత్యం, అంటే ఆంధ్రసాహిత్యాన్ని సమగ్రంగా అందించడమే ఆరుద్ర ఆశయం. ఆ ఆశయసాధన ఎన్ని అహోరాత్రాల్ని నమిలివేసిందో, ఆయన ఆరోగ్యాన్ని ఎంతంగా పిండివేసిందో

వారికే తెలీదు. ఏ అనారోగ్యపరిస్థితులుగానీ, మరేయితర ప్రాపంచిక బంధనాలుగానీ ఆయన కృషిని ఆపే ప్రయత్నమే చెయ్యలేదు. తత్ఫలితంగా సముద్భవించిందే ఈ సమగ్రాంధ్ర సాహిత్యం. ఇది ఆంధ్ర సారస్వత భవనానికి మణిదీపం.

సృజనాత్మకశైలి, విమర్శనా దృక్పథం, అపార మేధాసంపత్తి కలబోసిన సాహితీ గ్రంథమే ఇది. చెప్పేది సూటిగా చెప్పడం, చదివించేలా చెప్పడం వీరికి వెన్నతోపెట్టిన విద్య.

ప్రాచీన కావ్యాల్ని విశ్లేషించేటప్పుడు, సాహిత్య చరిత్రని సమగ్రంగానూ, సప్రమాణంగానూ నిరూపించేటప్పుడు, ఒక సాహిత్యకారునికి కావలసిన విజ్ఞానమూ, విమర్శకలక్షణాలూ ఆరుద్రలో సంపూర్ణంగా ఉన్నాయి. వీరు రాసిన జన్నార్దనాష్టక పీఠికా వ్యాసాన్నిగానీ, రామునికి సీత ఏమౌతుంది...? అనే వ్యాసాన్నిగానీ చదివితే ఆయన విజ్ఞానమెంతో మన ఊహకి అందదు. వెలుగుచూడని ఎన్నెన్నో విషయాల్ని లోతుగా పరిశీలించి నిగ్గుతేల్చడంలో దిట్ట శ్రీ ఆరుద్ర.

పూజ్యనీయ కందుకూరి వీరేశలింగంగారు ప్రామాణిక సాహిత్య చరిత్ర రచనకు పునాదులు వేశారు. శ్రీయుతులు మానవల్లి రామకృష్ణ కవిగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు మొదలైన మహనీయులు సాహిత్యంతోపాటు దేశచరిత్రని కూడా విశదీకరించారు. వీరందరి రచనల్నీ ఆధారంగా చేసుకొని ప్రస్తుతం లభించిన ప్రమాణాల మేరకూ సమగ్రాంధ్ర సాహిత్యరచనకు కంకణం కట్టుకున్నారు. ఎందరో విద్వాంసులు వ్యాసోన్ముఖంగా ప్రకటించిన అభిప్రాయాల్నీ, నూతన సిద్ధాంతాలనీ, వినూత్న విమర్శనాధోరణుల్ని క్రోడీకరించి తనదైన దృక్పథంతో సమన్వయ పరచి, ఆంధ్రసాహిత్య చరిత్రని, దేశచరిత్రని తన రచనలో జంట ప్రవాహాలుగా నిర్వహిస్తూ, కష్టించి ఫలింపజేసిన ఘనత వీరిదే.

ప్రపంచంలో ఏ భాషకీ లేని సమగ్ర సాహిత్య పరిశోధనా రచన దాదాపుగా తెలుగు సాహిత్యానికే ఉందని సగర్వంగా చాటిచెప్పుకోవచ్చు.

## త్వమేవాఽహం

ఆరుద్ర స్వీకరించే కవితావస్తువు సామ్యవాద సిద్ధాంతాలకీ, ఆశయాలకీ సంబంధించినదే అయినా, అభివ్యక్తిలో గాఢత, వ్యక్తీకరణలో చమత్కృతితో పెనవేసుకుపోయి అందమైన శిల్పంతో హృదయానందకరంచేస్తుంది. ప్రతీకలు, పదబంధాలు అత్యంత నవీనమైనవే. వీరి ప్రయోగాలన్నీ శుద్ధ తాత్విక ధోరణిలోనే ఇంకిపోక సామాజిక అవగాహనా లక్ష్యంతో సాగినై.

తెలంగాణా సాయుధ విప్లవం, సామ్యవాదవ్యవస్థ అనే రెండు అంశాలే త్వమేవాఽహం కావ్యంలో ప్రాతిపదికలుగా నిలిచినై. కాలానికున్న విలువ, దానికున్న శక్తి తెలియజేసే ఇతివృత్త వస్తువుతో త్వమేవాఽహం సాగింది. గడియారాన్ని తదంగ భాగాలైన చిన్నముల్లు, పెద్దముల్లు వంటి వాటిని సమాజానికి ప్రతీకలుగా వాడుకుంటూ అన్వయించి చూపడం ఈ కావ్యంలో కన్పిస్తుంది.

కాలం చేసే గమ్మత్తుల్నీ శక్తివంతమైన ప్రవాహవేగాన్ని అందమైన ప్రతీకలతో మలచిన ఇతివృత్తమే ం.

ఉదా : ''వివిధ దేశాల వ్యవహారాల మధ్య సవర్ణ దీర్ఘసంధి పొసిగిందో లేదో...?!
ఆశారేఖ గణిత రీత్యా, అభ్యుదయ బీజగణితం ద్వారా సాల్వ్.చేద్దామిప్పుడు.
పైథాగరస్ థీరమ్ తీరానికి తీసుకెళ్ళగలదు.''

ఇలా సమాజంలో వర్గపరమైన అన్వయాలెన్నెన్నో ఈ కావ్యంలో కన్పిస్తాయి.

**''సినీవాలి''**

''ఎంత చక్కని సంతోషాల చిలకలెగిరి పోయాయి.
ఇక్కట్ల గబ్బిలాలు ఇంట్లో స్థిర పడ్డాయి.
పదేళ్ళలో పాతికేళ్ళు గడిచినకట్లే హృదయం తుప్పు పట్టింది.
పచ్చదనం ఎక్కడికి పారిపోయింది.
శ్వాస తీసుకోవడమే కష్టంగా వుంది.''

ఆరుద్ర అతినవ్య కవిత్వానికి మచ్చుతునక ఈ కావ్యమే. మధ్యతరగతి నగర జీవితాల్ని ఆమోఘంగా అద్భుత ప్రతీకల పదబంధాలతో మేళవించిన కవితాత్మక కావ్యం ఇది.

ఇందులో క్లర్క్ సూర్యారావ్ నాయకుడు. అడుగడుగునా సగటు మధ్య తరగతివాడు నగరజీవితంలో ఎదుర్కొనే ఆటుపోట్లకి, సజీవ చిత్రణ ఈ కావ్యం. ఆధునిక దుర్భర జీవితం నుంచి, కొన్ని రేఖా చిత్రాల్ని ప్రయోగాత్మకంగా ఊహించి ఈ కవితలో పరిగణించారు. ఆరుద్ర కవిత్వ లక్షణాలైన నవ్యత, స్పష్టతకి ఈ కావ్యం ప్రతీక.

'ఆగెన్ నేష్' అనే అమెరికా రచనల ప్రేరణతో ఇంటింటి పద్యాల్ని రచించారు. ఈ ఇంటింటి పద్యాలకి నిర్దుష్టమైన ఛందస్సు లేకపోయినప్పటికీ నాలుగు పాదాలలో అంత్యప్రాస నియమంతో సాగినై. సుమారు 15 సంవత్సరాల క్రితం ఆంధ్రవారపత్రికలో ఇవి ధారావాహికంగా సాగినై. ఇవికాక ఇంకా కేరాలాక్షి అనే మకుటంతో వచ్చిన పద్యాలు ఆరుద్రకిఎంతో కీర్తిని తెచ్చిపెట్టాయి. ఇవన్నీ కాక ఆరుద్ర రచించిన మరో తేటమాట మేటి రచన ''కూనలమ్మ పదాలు''

'' ఓ కూనలమ్మా....!'' అనే మకుటంతో, సమాజంపైనా, రాజకీయాలపైనా, వ్యక్తులపైనా, వ్యక్తిత్వాలపైనా, ఇలా ఇదని చెప్పలేని కవితావస్తువులతో ఆరుద్ర చేసిన వ్యాఖ్యలు, విసుర్లు, వినోదాలన్నీ ఈ కూనలమ్మ పదాల్లోనే సాగాయి.

''సగం కమ్యూనిష్టు
సగం కేపిటలిష్టు
ఎందు కొచ్చెను రొష్టు.... ఓ కూనలమ్మా....!''

ఇలాంటి ఎన్నెన్నో సామాజిక వస్తు విషయాలపై కలం దూసారు. సరళమైన తేట తెలుగు పదాలతో చక్కగా చెప్పడం ఈ పదాల ప్రత్యేకత. కృష్ణునిపై వ్రాసిన కూనలమ్మ పదాలు వీటిలో చాలా ముఖ్యమైనవి.

''వెన్న మీగడపాలు
వెలది సౌందర్యాలు
బాల కృష్ణుని పాలు.... ఓ కూనలమ్మా....''

అంత్యప్రాసల నడక ఈ మాత్రా ఛందస్సుకి మరింత శోభని కల్గించాయి.

''చెలుల చీరలు దాచి
చెల్లి ద్రౌపది గాచి
చేసెనే లాలోచి.... ఓకూనలమ్మా....''

రెండు అసంబద్ధ సంఘటనల్ని ముడివేసి వర్ణించడం వీరికే చెల్లు.

మేనమామకు యముడు

మేనయత్తకు మరుడు

ఘనుడు కద మాధవుడు.... ఓ కూనలమ్మా.....

ఎవరికీ తట్టని విషయాల్ని, ఎంతో చమత్కారంగా చెప్పే లక్షణం ఈ కూనలమ్మ పదాల్లో కన్పిస్తుంది.

తెలుగు కవిత్వంలోని తేటదనానికి మచ్చుతునకలు ఈ కూనలమ్మ పదాలు.

ఇక ఆరుద్రగారిని ఆకాశం అంత ఎత్తుకు చేరవేసినది ఆయన రాసిన పాటలే. వీరి సినీగీతాలు అజరామరాలు. నిత్యం సహృదయుల నాల్కలపై నానుతూ వుండే రస గుళికలు. వీరు రాసిన ప్రతి రచనలో వలెనే పాటలో కూడా ఆరుద్ర ముద్ర ఉంటుంది. మనకెన్ని వేవేల సినీగీతాలు ఉన్నా ఓ పాట వినగానే ఇది ఆరుద్రగారి పాటేనని టక్కున చెప్పెయ్యవచ్చు.

ఎంతో చక్కని భాషలో అతిసరళంగా, తెలుగుతనం ఉట్టిపడేట్లుగా పాటలు జాలువారాయి ఆయన కలం నించి. చక్కని నుడికారలు, జాతీయాలు, తెలుగు పలుకుబళ్ళు, సామెతల ప్రయోగాల్లో ఆయన సృజనత్వం అందెవేసిన చేయి.

తెలుగుతనం భావుకత్వం, చమత్కారం ఈ మూడింటి ముప్పేటల అల్లికతో సాహితీ హృదయాల్ని గిలిగింతలు పెడుతుంది ఆరుద్రపాట.

ఉయ్యాల జంపాల చిత్రంలో-

''కొండగాలి తిరిగింది

గుండె ఊసులాడింది

గోదావరి వరదలాగ కోరిక చెలరేగింది....

పుట్టమీద పాలపిట్ట పొంగిపోయి కులికింది

గట్టుమీద కన్నెలేడి గంతులేసి ఆడింది

పట్టపగలు సిరివెన్నెల భరత నాట్యమాడింది

పట్టరాని లేత వలపు పరవశించి పాడింది'' - అంటారు.

పల్లెపదాల్లో అద్భుతమైన ప్రతీకల్ని, ప్రతీకలలో స్వేచ్ఛాభావజాలాన్నీ, స్వేచ్ఛాభావజాలంలో నవ్యతని పుణికి పుచ్చుకున్న అందమైన పదాల కలయికే ఈ పాట.

పదాల్ని పొదుపుగా వాడటంలో ఆరుద్ర దిట్ట. అతి తక్కువ పదాల్ని ప్రయోగించి, అత్యధిక భావాన్ని ప్రకటించడం, ఆయన రచనల్లో కన్పించే సహజమైన లక్షణం.

''ముత్యమంత పసుపు - ముఖమంత ఛాయ

ముత్తైదు కుంకుమ - బ్రతుకంత ఛాయ''

ముత్యాలముగ్గు చిత్రంలోని ఈ పాటలోని అభివ్యక్తి చాలా సూటిగా స్పష్టంగా కన్పిస్తుంది.

''ఆరనైదోతనము ఏ చోటనుండు

అరుగులలికేవారి అరచేత నుండు''

''ఇంటి ఇల్లాలికి ఎంత సౌభాగ్యం

ఇంటిల్లిపాదికీ అంత వైభోగం'' - అంటారు.

ఈ చరణాల్లో సాంప్రదాయిక కవిత్వం పరవళ్ళు తొక్కుతుంది.

వీరికి హేతువాద దృష్టి మెండు. అందుకే వీరి ఏ రచన చూసినా సహేతుకంగానూ, సర్వ సలక్షణ సమ్మిళితంగానూ ఉంటుంది. నిజాన్ని నిగ్గుతేల్చడంలోనూ, యథార్థాన్ని విశ్లేషించడంలోనూ, వీరి కలం చాలా పదునెక్కిపోయి ఉంది.

''ధనమేరా అన్నిటికీ మూలం
ఆ ధనము విలువ తెలుసుకొనుట మానవ ధర్మం.....
మానవుడే ధనమన్నది సృజియించెనురా
దానికి తానే తెలియని దాసుడాయెరా....
ధనలక్ష్మిని అదుపులోన పెట్టిన వాడు
ధనవంతుడు బలవంతుడు భాగవంతుడురా...''

ఈ పాట లక్ష్మీనివాసం చిత్రంలోనిది. ఈ పాటలోని ప్రతి వాక్యమూ అక్షర సత్యమే. లోక ప్రవృత్తిని ఎంతో నిశితంగా పరిశీలించకపోతే ఇటువంటి అద్భుతమైన పాటని రాయడం దుస్సాధ్యమే.

ధనం యొక్క స్వభావాన్ని, ధనార్జనలోనున్న పరమార్థాన్ని తెలియజేస్తూ

''ఉన్ననాడు తెలివి కలిగి పొదుపు సేయరా
లేనివాడు ఒడలు వంచి కూడా బెట్టరా''

అని దారిద్ర్యాన్ని రూపుమాపే తరుణోపాయం కూడా చెప్తారు.

''కొండలైన కరిగిపోవు కూర్చుని తింటే
అయ్యో...! కూలిపోవు కాపురాలు ఇది తెలియకుంటే...''

అని జనవ్యవహారంలో ఉన్న చక్కని సామెతని పాటలో ఇమిడ్చి సామాన్యజనుల సాధకబాధకాల్ని కళ్ళకి కట్టినట్లు కవిత్వీకరిస్తారు.

ఇంక అంత్య ప్రాసల్ని అందరూ వేస్తారు. కానీ ఆరుద్ర చాలా అందంగా వేస్తారు. ఆయన రచనలో ఎక్కడా పదం కోసం ప్రాకులాటగానీ ప్రాసకోసం పీకులాటగానీ కన్పించదు.

''ఎదగడానికెందుకురా తొందర
ఎధర బ్రతుకంతా చిందర వందర''

ఈ పాటలో విద్యావ్యవస్థ స్థితిగతుల్ని చాలా చమత్కారంగా చెప్పారు.

తెలుగుతనం ఉట్టిపడే పదాలతో, జానపద గీతాల్ని మరపించేట్టుగా తెలుగు నుడికారాలతో అందంగా రాసారు బొబ్బిలియుద్ధం అనే చిత్రంలో...

ముత్యాల చెమ్మచెక్క
రతనాల చెమ్మచెక్క
ఓ చెలీ...! మురిపెముగా ఆడుదమా
కిలకిల కలకల నవ్వులతో గాజులు గలగలలాడ....

ఇదీ వీరి సహజ కవిత్వ సంపద పల్లెతనం, పడుచుపిల్లతనం ఈ పాట చరణంలో పైట వేసుకున్నంత అందంగా కన్పిస్తుంది.

ఆరుద్ర బ్రహ్మని కూడా ప్రశ్నించారు. అదృష్టవంతులు చిత్రంలో

అయ్యయ్యో బ్రహ్మయ్యా
అన్యాయం చేసావేమయ్యా
ఈ బుల్లోడే బుల్లెమ్మయితే
ఎంత గుమ్ముగా ఉండేదయ్యా....

ప్రక్కవారితో మాట్లాడుతున్నట్లుగా పాటల్ని అల్లేయడం ఆరుద్ర సొత్తు. ఆరుద్ర పాటల్లో కూడా ఎన్నో ప్రయోగాలు చేసారు. మచ్చుకు ఒకటి.

''భూమ్మీద సుఖపడితే తప్పు లేదురా
బులపాటం తీర్చుకుంటే తప్పు లేదురా....''

బుద్ధిమంతుడు చిత్రంలోని ఈపాట పైకి మామూలుగానే కన్పించినా ఒక విశేషముంది. ఈ పాటని పాడితే మన పెదవులు రెండు ముద్దుపెట్టినట్లు ఆకారం దాలుస్తాయి. ముద్దు ముద్దుగా ఉండేదుకు పెదవులతో పలికే అక్షరాల్నే పదే పదే ఉపయోగించి ఒక విచిత్ర ప్రయోగం చేసారు.

ఇంక చమత్కారాన్ని పండించడంలో మంచి నేర్పరి ఆరుద్ర

టాటా- వీడుకోలు
గుడ్‌బై - ఇంక సెలవ్....
తొలినాటి వలపుల కన్నా నులివెచ్చని దేదీ లేదని
నిన్ననె నాకు తెలిసింది ఓ చిన్నది నాకు తెలిపింది
ఆ ప్రేమ నగరుకే పోతాను.
ఈ కామ నగరుకు రాను.... ఇకరాను.... అంటూ

ప్రేమ ఔన్నత్యాన్ని మత్తులో తేలిపోయే వారి భాషలోనే వ్యక్తీకరిస్తారు.

ఇటువంటి ఎన్నెన్నో మేటిగీతాల్ని రసజ్ఞులకి శ్రవణానందకరం చేసిన కవి ఆరుద్ర.

శ్రీ ఆరుద్రగారు ఏ రచన చేసినా వారిని ప్రోత్సహించి, రాసేందుకు కావలసిన అనుకూల వాతావరణాన్ని ఆయనకి సమకూర్చిన వారి సతీమణి శ్రీమతి రామలక్ష్మి గారికి ఆంధ్రసాహితీ రసజ్ఞులందరూ ఋణపడి ఉన్నట్లే.

ఆరుద్రగారు తన సమగ్రాంధ్ర సాహిత్యంలో తన భార్యను గూర్చి ''చిట్టచివర చెబుతున్నా మెట్టమొదట పేర్కొన వలసిన సదుపాయాలు కల్పించి, అనుకూల వాతావరణాన్ని నాకు కల్పించిన శ్రీమతి రామలక్ష్మికి - ఈ పరమార్థాన్ని సాధింపజేస్తున్న నా ఉత్తమార్థానికి అభినందనలు.'' అంటూ కొనియాడారు.

ఇటువంటి సమర్థనీయ సాహితీ సౌమ్య నిరాడంబర మూర్తి శ్రీ ఆరుద్రగారు ఒక మానవమాత్రునిగా జీవితాకాశం నుంచి ఓ నక్షత్రంగా రాలిపోయినా-

సాహితీ వినీలాకాశంలో ఎన్నటికీ నిలిచిపోయే ధ్రువనక్షత్రం ఆయన.

''నువ్వెక్కబోయే రైలు జీవిత కాలం లేటు'' అని నిర్వచించిన నిత్య సత్యాన్వేషి ఆరుద్ర.

ఆరుద్ర - ఒక నక్షత్రమే కానీ మన ఆరుద్రగారు ఒక సాహితీ ప్రపంచం.

# రామారావు రంగుల రాగమాలలు!

(గత సంచిక తరువాయి) – చలసాని ప్రసాదరావు

... భారత, న్యూజీలాండ్, ఇంగ్లాండ్, అమెరికా దేశాల నేషనల్ మ్యూజియంలలో అతని చిత్రాలకు గౌరవ స్థానం లభింప చేసుకున్నాడు.

... ఇంగ్లాండ్ లోని అత్యున్నత శ్రేణికి చెందిన, చిత్రకళా రంగంలో ఆధునికుల్లో అప్పటి వరకూ పికాసో వంటి విశ్వవిఖ్యాత చిత్రకారులు ముగ్గురు, నలుగురిని మాత్రమే గుర్తించి గౌరవించిన విక్టోరియా అండ్ ఆల్బర్ట్ మ్యూజియం రామారావును గుర్తించి ఆ కొద్దిమంది చిత్రాల సరసనే ఇతని చిత్రాన్నీ అలంకరించింది.

... ఓ అమెరికన్ యూనివర్సిటీచే చిత్రకళాధ్యాపకునిగా ఆహ్వానింపబడి ఆదేశం వెళ్లి, తరువాత ఆ ఉద్యోగం మానుకున్నా స్థిరపడిపోయాడు. అమెరికాలోనే, చికాగోలో.

★ ★ ★

ఆరు దశాబ్దాల క్రితం కృష్ణాజిల్లా గుడివాడలో పుట్టిన రామారావులోని కళాకారుడు అక్కడే రూపు దిద్దుకోసాగాడు. తండ్రి ఆ చుట్టు ప్రక్కలకెల్లా పేరుమోసిన దారుశిల్పి. ఆయన రామారావును మలచాలనుకున్నది ఇంజనీరుగా లేదా కనీసం డాక్టరుగా.

కాని రామారావు చదవసాగింది ఎకనమిక్సుని, అదే సమయంలో చిత్రలేఖనంలో శిక్షణ పొందసాగినది తెలుగుదేశమంతటా కొన్ని వందలమంది శిష్యుల్ని నిలబెట్టి విజయవాడలో స్కూల్ ఆఫ్ ఆర్ట్ నిర్వహించిన ప్రముఖ చిత్రకారుడు వేణుగోపాల్ వద్ద. ఆసమయంలో ఆయనగుడివాడలోనే

అదేకాలంలో రామారావులో చిత్రకళలోనూ, సాహిత్యంలోనూ తృష్ణరేకెత్తించి ఒక స్థాయికి రావటంలో తోడ్పడిన వారు మేడూరి వెంకటప్పయ్యశర్మ, డాక్టర్ శ్రీదేవి. సినిమాల్లో చేరదామని మద్రాసువచ్చిన 'బి.కాం. కుర్రాడు' రామారావును స్కూల్ ఆఫ్ ఆర్ట్ లో చేర్పించి రుణగ్రస్తుణ్ణి చేసుకున్న వారు కళాదర్శకులు సూరన్న, గోఖలేలు.

మద్రాస్ స్కూల్ ఆఫ్ ఆర్ట్సులోని ఆరేండ్ల డిప్లొమాకోర్సును నాలుగేండ్లలో పూర్తిచేయగలిగిన దక్షతను చేకూర్చి పెట్టినవారు కళాక్షేత్రంలోని చిత్రకళాధ్యాపకులు కె. శ్రీనివాసులు. వెన్నుతట్టి, నిలబెట్టి, ప్రోత్సాహాన్నీ, చేయూతను ఇచ్చినవారు. సుప్రసిద్ధ కళావిమర్శకులు జి. వెంకటాచలం.

★ ★ ★

లండన్ వెళ్లిన తొలిరోజుల్లో ఓ జాబులో వ్రాశాడు రామారావు. ''నేనిప్పుడిక్కడేం చేస్తున్నానో ఊహించగలరా: మోడల్స్ ముందు కూర్చుని లైఫ్ స్కెచెస్. లైన్ డ్రాయింగ్స్ వేస్తున్నాను'' అని.

ఆ ఉత్తరమే గనుక అప్పట్లో మరో చిత్రకారుడెవరైనా చదివి ఉన్నట్లయితే నవ్వి లేదా నవ్వుకుని ఉండేవాడు.

చిత్రకళాశాలల్లో చేరిన ఆరంభ దశలో ప్రతి విద్యార్థీ చేసేపని ఈ మోడల్స్ ఆధారంగా రేఖా చిత్ర రచన చేయటమే. ఇది అతని కళాజీవితంలోని బాల్యదశ.

అలాంటపుడు దాదాపు ఎనిమిదేళ్లు కళాభ్యాసం, మరో రెండేళ్లు రీసెర్చ్ స్కాలర్‌గా కళాసాధన

చేసి మరీ లండన్‌చేరుకున్న రామారావు ఇలా అక్కడ తనకృషికి శ్రీకారంచుట్టాడూ అంటే వింతగానే వుంటుంది గదా!

కాని, అందులోనే ఉంది రామారావు సాధించిన ఇన్ని విజయాల వెనుకగల రహస్యం.

అత్యున్నత ప్రమాణాల నందుకున్న సాధారణ కళా స్థాయియే ఈనాటి ఆధునిక చిత్రకళా రూపం అనేది ఈనాడు చాలామంది మరచిపోతున్నారు.

రూప నిర్మాణంలో స్రష్టయై ఆయారూపాల స్వభావాల నవగతం చేసుకోగలిగినవారే అరూపం లోనూ రూపాన్ని దర్శించగలరు. దర్శింప జేయగల శక్తీ కలిగి వుంటారు.

కవిత్వంలోవున్నట్లే చిత్రకళలోనూ సింబాలిజం అనేదుంది. '' ఏడు కొండల వాడు'' అన్నపుడు తిరుపతిలోని వేంకటేశ్వర స్వామిగాని, పద్మలతల మధ్య ప్రదర్శింపబడిన పాదాలను దర్శించినపుడు బుద్ధుడుగానీ, కుంచెను చూడగానే చిత్రకారుడుగానీ ఎందుకు స్ఫురిస్తున్నారూ అని ఈనాడెవరూ సందేహించటంలేదు. కారణం వారు అందుకు అలవాటుపడిపోయారు గనుక. ఆయా పరిచితరూపాలకీ అసమగ్రరూపాలను చిహ్నాలుగా వారేనాడో గుర్తించేశారు గనుక.

వందల మాటలు వివరించలేని భావాన్ని ఒకరేఖ, అందంగా, శక్తివంతంగా, లయబద్ధంగా మలుపులు తిరిగిన ఒక్క రేఖ విప్పిచెప్పగలదని నానుడి.

ఆ నానుడిని నిజంచేసే యత్నంలో పుట్టిపెరిగినదే ఆధునిక చిత్రకళ.

చిత్రలేఖనానికి లొంగని విషయవస్తు వంటూ లేదు, ఏ భావాన్నయినా శక్తి వంతంగా దర్శింపజేయగలదది. తేడా అల్లా ''ఎలాచూపాలి?'' అనే సమస్యను పరిష్కరించుకోగలగటంలో ఉంది. కాలంతోపాటు పరిష్కారమార్గాలూ మారుతూ వస్తున్నాయి తప్ప ఇప్పుడమాంతం ఒచ్చి పడ్డ దేమీ లేదు.

ఎక్కడికో ఉదాహరణలకు పోనక్కరలేదు. మన అజంతా చిత్రాల్లోనే, బుద్ధుడు బిక్షాపాత్రతోరాగా యశోధర రాహులుని చేత భిక్షవేయిస్తున్న దృశ్యం ఒకటుంది.

అది అజంతా చిత్రకారులకు అలవాటయిన సాధారణ శైలి లోనే చిత్రించబడింది. కాని యశోధరా రాహులులు బుద్ధుని మోకాళ్ల వరకయినా రానంతటి మరుగుజ్జులుగా చూపబడ్డారు.

అందుకు కారణం, బుద్ధుడు మిగతావారికన్నా మహోన్నతుడని చెప్పదలచటమే. అలాచెప్పటానికి ఆనాటి చిత్రకారునికి తోచిన మార్గమది. అర్థం చేసుకోగలవారికది భావస్ఫోరకంగా గోచరిస్తుంది. లేనివారికది అసహజమే!

అబ్‌స్ట్రాక్ట్ ఆర్టును తనదిగా చేసుకున్న చిత్రకారుడు చెస్తున్నదీ దాదాపు ఇదే. ఇటువంటి ధోరణినే మరింత ముందుకు తీసుకుపోవటమే.

పరిణితినొందిన సింబాలిజమే అరూపకళ అనికూడా మనం అర్థంచెప్పుకోవచ్చు.

ఒక వస్తువు, లేదా రూపం, లేదా దృశ్యం యొక్క బాహ్యరూపం అందరికీ సుపరిచితమే గనుక, దానినే మరలా, మరలా, వేరే, వేరే రంగులుపులిమి చూపయత్నించటం వృధా! దాని అంతర్గతరూపాన్ని దర్శింపజేయగలగాలి, అనేది ఈనాటి చిత్రకారులలో అధిక సంఖ్యాకుల మతం.

అంతవరకూ పరిచితంగా ఉండిపోయిన రూపానికి రూపకల్పన రేఖలలోగాకకేవలవం రంగులలోనే చేయబడినప్పుడది ఇతరులకపరిచితంగా, అగ్రాహ్యంగా ఉండటం సహజం. అదే జరుగుతోంది ఆధునిక చిత్రకళలో!

చలాన్ని మనం చూశాం. చదివాం. 'చలం' అనగానే ఈనాడు మనకేం స్ఫురిస్తోంది. రమణాశ్రమంలోవున్న ఈనాటి చలంగాక మనల్నాకట్టుకున్న అతని రచనలే తక్షణం స్ఫురించటం లేదా! మన మన అభి రుచుల్ని బట్టి అమీనాయో మరో పాత్రో మనోపథంలో మెదలటం లేదా! 'చలం' అనే భావానికి ప్రతిగా మన మనసుల్లో పేరుకుపోయిన జ్ఞాపకాలకది మచ్చుతునకగాదా.

శ్రీశ్రీ అనగానే 'ఖడ్గసృష్టి' కన్నా, 'మూడుయాభైల' కన్నా 'మహాప్రస్థానమే' మనకు ముందుగా స్ఫురించటం లేదా! అందులోని మహావేగంతో సాగిపోయే కవితా ఘోష మన కర్ణకుహరాలలో గింగురుమనటం లేదా!

అలాగాక, స్వయంగానో, ఫొటోల్లోనో చూసిన శ్రీ శ్రీ రూపం మన కండ్లముందు ఎందుకు మెదలటం లేదు?

మన అనుభవాన్ని బట్టి, అధ్యయనశక్తిని బట్టి మనకు తెలియకుండానే మనలో ఇవే గుర్తుండి మనసులో నివాసముండిపోయాయి గనుక.

ఏ టూరిస్ట్‌గైడ్‌లోనో విజయవాడను పరిచయం చేయదలచివారు ఏ కనకదుర్గగుడి తాలూకు ఫొటోనో కృష్ణా బరాజ్‌నో ఆపరిచయం ప్రక్కన వేస్తారు. రానురాను విజయవాడను గుర్తించటానికి ''సింబల్స్''గా తయారవుతాయవి.

కాని, నేనెన్నో సంవత్సరాలు విజయవాడలో గడిపాను. ఆ ఊళ్లో నాకు పరిచయంలేని ప్రాంతంలేదు. ఈనాడు నేను విజయవాడను చిత్రించాలి నా కాన్వాసుమీద.

విజయవాడ అనగానే నాకు స్ఫురించేది కృష్ణానదిలోంచి బయలుదేరిన ఓ పెద్ద కాలువ, అందులోంచి చీలిపోయి, సాగిపోయే మరి మూడుకాల్వలు. వాటిమధ్యనా ఆ చుట్టూరానూ ఇరుకిరుకుగా పెరిగిపోయిన మురికివాడ.

నేను దాన్ని గుర్తించిన రూపంలో, చూపగల విధానంలో చిత్రించాను. చూసినవారంటారు. 'ఇదా విజయవాడ? ఏమిటా మూడు పొడవాటిగీతలు? వాటిమధ్య ఆ పెంటకుప్పలేమిటి?' అని.

నేను చెప్పి 'ఔరా' అనిపించుకోగలాలిగదా! ఎందుకంటే అందులో ఏముందా అనీ, విజయవాడ ఎక్కడుందా? అనీ వారు వెదుకుతున్నారుగనుక. వారు చూసిన, చూస్తున్న విజయవాడకూ, నేను చూసి, నాలో రూపకల్పన చేసుకున్న విజయవాడకూ యెక్కడా పోలికేలేక వారు ఆ చిత్రాన్ని చూసి అయోమయంలో పడిపోయారు గనుక. గాత్రమే 'ని వివిధ

అదే నాతోటి చిత్రకారుడో, నా భావాలెరిగిన, నా చిత్రణా విధానాన్నెరిగిన సన్నిహితుడైన, మనం. కళాభిమానో అయితే వారందులోని భావానికన్నా కళావిలువలకెక్కువ ప్రాధాన్యతనిస్తూ పరిశీలిస్తారు ఎందుకంటే ఆ చిత్రంలోని 'విజయవాడ' అనేది నా చిత్రణకొక ఆలంబనం మాత్రమే గనుక చిత్రకారుడుగా నా నైపుణ్యాన్ని ప్రదర్శించే యత్నంలో 'విజయవాడ' అనే సబ్జెక్ట్ నాకొక అలంబనుండి విడగొట్టి మాత్రమే వినియోగపడింది గాని అదే ప్రధానంగాదు గనుకా. అది కేవలం విజయవాడే కానక్క?

మరే మురికివాడయినా కావచ్చు. ఎందుకంటే నాచిత్రంలోని విజయవాడ నాకళ్లు చూసిన విజయవాడ గాక నామనసు అర్థంచేసుకున్న విజయవాడ మాత్రమే.

అయితే అలాగే ఎందుకు చిత్రించాలి? కాస్త నలుగురికీ అర్థమయేలాగే ఆ భావాల్నెందుకు ప్రదర్శించరాదూ? అనేమాటనూ తేలికగా తీసివెయ్యలేం.

కాని,

కవిత్వం రాసేవాడు హృదయంలోంచి లావాలా భావాలెగదన్నుకువస్తున్న సమయాన మాటలకోసం తడుముకోడు. భాషతో మంచి పరిచయం ఉన్నవారెవరూ భావాలకు మధ్యలో బంధంవేసి మంచి మంచి అందమైన మాటల కోసం బుర్రలోని డిక్షనరీని తిరగేస్తూ కాలయాపన చేయరు.

కవికి ఆ పదజాలమెలాంటిదో చిత్రకారునికి వర్ణం అలాంటిది.

కళకు ప్రాణం రంగూ, రేఖా!

చిత్రకారుని సామర్థ్యాన్ని నిర్ణయించేది అతని వర్ణసంవిధాన నైపుణ్యం.

నిలబెట్టగలిగేది అతని భావసంపద.

రామారావు లండన్‌వెళ్లి ఓ తెల్లవారుజామున అకస్మాత్తుగా అరూపచిత్రకారునిగా అవతారమెత్తలేదు.

కళ ఒక నిర్విరామ సాధన, అంతం లేని అన్వేషణ!

మద్రాసులో ఉండగా అతను వేసిన చిత్రాలలోనూ నేటి అతనికళకు మూలమైన భావాలున్నాయి. ఆనాటికి అతని చిత్రాల్లోని రూపాలు పూర్తిగా అరూపమైపోలేదు. అరూపంలోకి పరివర్తనచెంద యత్నిస్తున్న ఛాయలుమాత్రం కొట్టవచ్చినట్లు కనుపించేవి. ''యువతితో మైనా'', ''పర్వతాలూ-చెట్లూ'', ''పిట్టల్ని అమ్మేవాడు'' వంటి చిత్రాలనేకం ఈకోవకే చెందుతాయి.

లండన్ వెళ్లాక విశాలంగా విస్తరించుకున్న అతనిచుట్టూగల కళాప్రపంచం, నిశితపరిశీలన, నిర్విరామసాధన ఆ పరివర్తనను త్వరితంచేసి సహకరించాయి.

కాగా, అతనందుకున్న స్థాయిని అంచనావేసి, విలువ గ్రహించి ఆదరించి గౌరవించగల కళాప్రియులక్కడఅతనికి లభ్యమయ్యారు.

రామారావును గురించి వ్రాసిన పాశ్చాత్య కళావిమర్శకులు దాదాపు అందరూ ఏకగ్రీవంగా అన్నమాట. ''ప్రాచ్య, పాశ్చాత్య కళావిధానాల మిశ్రమంతో రూపొందిన ఒక నూతనశైలి అతని చిత్రాల్లో కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది'' ని.

రవీంద్రనాథ్ టాగోర్ వాటర్ కలర్స్‌లో టెంపరా విధానంలో తన చిత్రాలలో ప్రదర్శించిన అపూర్వమైన వెలుగును తన చిత్రాలలో అయిల్ కలర్స్‌లో తేవాలనేది తన యత్నమని రామారావు ఓసారి అన్నాడు.

అలాంటి వెలుగు నేటి రామారావు చిత్రాలన్నింటా ప్రత్యక్షం. ఆరంగుల సమ్మేళనం అతని చిత్రాల్ని వంద ఇతర చిత్రాలమధ్యకూడా ఇట్టే మొదటిచూపుతోనే ఆకర్షించి కట్టిపడవేస్తుంది.

'ఇవి ఫలానా చిత్రకారుని చిత్రాలు' అని అవే చెపుతాయి మనకు.

ఏ చిత్రకారుడయినా తన కళలో సాధించాలని కోరుకునేది ఇటువంటి గుర్తింపునే, ప్రత్యేకతనే, విశిష్టతనే. దాన్ని రామారావు సమర్థవంతంగా సాధించాడు, లండన్ చేరిన అనతికాలంలోనే.

ఇటువంటి నూతన విలువల పరిధిలో చిత్రింపబడిన రామారావు సృష్టిలో 'లేపాక్షి' అనే చిత్రంలో మనకు లేపాక్షి కనుపించదు. రామారావే కనుపిస్తాడు. అతనిరంగులే కనుపిస్తాయి. కాని వర్ణపరిజ్ఞానం ఉన్నవారికి అతని 'భీతరస' లో ఆ రసం కనుపిస్తుంది. కేవలం కనుపించటమే గాదు భీతినీ కలిగిస్తుంది. అలాగే 'సాంధ్యరాగం' మనల్ని కదలిస్తుంది. కరిగిస్తుంది. అందుకు కారణం ఆయా చిత్రాల్లో అతనువాడిన సింబల్స్, రంగులూ వాటిసమ్మేళనం మనల్ని ఆయాభావాలకు సన్నిహితంగా తీసుకు పోగలిగేట్లున్నాయి గనుక.

'లేపాక్షి' అనేదానికి మనమెరిగిన రూపం ఉంది. కనుక మన అనుభవానికి ఆచిత్రంలోని రూపం దూరం.

'భీత రసా' నికిగాని 'సాంధ్య రాగా' నికిగాని స్థిరరూపమంటూ ఏదీ లేదు. కనుకనే మన ఊహకిక్కడ అవకాశం దొరికింది. ఊహించాం. ఊహబలపడటానికి చిత్రకారుని వర్ణ సామర్థ్యం, కళా దృష్టితోడై అనుభూతినీ యిచ్చాయి.

అలాగే రామారావు ''విజయవాడ వద్ద కృష్ణానది'' కూడా.

ఈ సీరిస్‌లో మనకు తెలిసిన విజయవాడను గానీ, కృష్ణనుగానీ చూప యత్నించ లేదు చిత్ర కారుడు. వాటి చుట్టూ తనలో గూడుకట్టుకున్న భావాన్ని చూపదలచాడతను.

మనమూ అతని భావాన్నందుకో యత్నిద్దాం.

కృష్ణ ఒడ్డునుంచో, ఒడ్డున గల కొండమీది నుంచో చూస్తే కనుపించే పరిమిత దృశ్యాన్ని వదలి మనం చిత్రకారుని వెంట కాస్త పైకి వెళ్లుదాం.

ఏం కనిపిస్తోందిప్పుడు?

రెండు కొండల మధ్యగా పారే నీలి ప్రవాహం, ఒకవైపు పచ్చని పొలాలు, మధ్యమధ్య మరీ ముదురురంగులో చెట్లతలలు. పిల్లకాలువలు. మరోవైపు మహానగరం. రోడ్లు, సందులు, గొందులు కనిపించవు స్పష్టంగా, కనుపించేదల్లా అస్తవ్యస్తంగా రూపొందిన నగరం. రోడ్లపై ఉరకలతో సాగిపోయే నిర్విరామ యాత్ర. అల్పంగా, అసమగ్రంగా గోచరించే జీవన సంగ్రామ ఛాయలు.

ఇంకాస్త పైకి మేఘాలను కూడా దాటి వెళ్లుదాం.

ఇప్పుడు దృశ్యం పూర్తిగా మారిపోలేదా!

ఇంతవరకూ సూచనగా కనిపిస్తూవచ్చిన దృశ్యాలన్నీ అదృశ్యమై వాటి ఛాయలు మాత్రమే కనిపిస్తున్నాయిగదా. ఇట్టిస్థితిలో అంతకుముందు మన కళ్లుచూసిన దృశ్యాన్ని, అందులోని వివిధ వివరాలను ఇప్పుడు మనోనేత్రంతో వెదకి ఏది ఎక్కడున్నదో గుర్తించ యత్నించటం లేదా మనం.

ఈ స్థితిలో మనకు ఆ గుర్తింపుకు తోడ్పడుతున్న ఆధారాలేమిటి?

ఆయా ప్రాంతాల తాలూకు స్థూల స్వరూపాలేగదా. ఒక దానిని మరొక దానినుండి విడగొట్టి చూపుతున్నవి వాటి స్థూల రూపాలూ రంగులూ కాదా.

ఈ స్థితిలోనించి కనుపించే 'విజయవాడ వద్ద కృష్ణానది'ని చిత్రించాడు రామారావు, దానికి ఇంకాస్త భావన తోడయింది. రంగులు వేగంగా తారాడాయి అంతే!

గజిబిజిగా ఉన్న రంగుల సమ్మేళనాన్ని అస్తవ్యస్తమూ, సంకులమూనైన నగరానికి చిహ్నంగా తీసుకోవచ్చు. వేగంగా మెలికలు తిరిగిపోతూన్న కృష్ణానదినీ గుర్తించవచ్చు. పైన ప్రశాంతంగా ఉండే ఆకాశాన్నీ స్వచ్ఛవర్ణాల్లో గుర్తించవచ్చు. మధ్య నిప్పులు గ్రక్కే సూర్యుడీ రంగుల్ని మరింతగా వెలిగింపజేయటాన్నీ గుర్తించవచ్చు.

ఇక్కడితో చిత్రకారుని భావం, భావాత్మక చిత్రణ పూర్తయింది.

దీన్ని చిత్రించిన రామారావే ఇదే ఇతివృత్తం తీసుకుని మరో పాతిక చిత్రాలూ వేయవచ్చు. రంగుల మిశ్రమం అనేదానికి అంతం లేదు. ఉన్న వర్ణాలలోంచే అసంఖ్యాకంగా మరిన్ని సృష్టించగలం. చిత్రానికీ, చిత్రానికీ వర్ణాలు మారి కంటికి అందే ఆహ్లాదంలో మార్పునూ తెస్తాయి. చిత్రంలో స్థిరరూపాలంటూ ఏవీ లేవుగనుక చిత్రకారుని వర్ణస్వేచ్ఛకు హద్దులూ లేవు.

అదే అరూపకళ ఇచ్చే ఒక ప్రధాన సౌకర్యం కూడా. ఈ స్వేచ్ఛ ఎటువంటిదంటే ఈ చిత్రం ఇప్పుడు కేవలం 'విజయవాడవద్ద కృష్ణానది' మాత్రమే అనుకోనవసరం లేదు. అటువంటి పరిసరాలున్న మరేదయినాకూడా కావచ్చు. 'లండన్ వద్ద థేమ్సునది కావచ్చు. కాకినాడ వద్ద కాలువ కావచ్చు. ఎందుకంటే ఈ అన్నింటి బిన్నత్వం మధ్యాగల ఏకత్వాన్ని అరూపకళ సన్నిహితం చేస్తోంది గనుక.

కానీ, చిత్రకారుడు దీన్ని చిత్రించే సమయంలో అతనిలో మెదలుతూన్న భావాలు అతని గత అనుభూతుల్లోని 'విజయవాడ వద్ద కృష్ణానది'నే ఆలంబనంగా చేసుకున్నాయి గనుక అతనికి మాత్రం అవి అంతే.

★ ★ ★

ఈ ''విజయవాడ వద్ద కృష్ణానది'' సీరీస్ చిత్రాలతో పాశ్చాత్య కళారంగాన్నా కట్టుకున్న రామారావు ఆ తర్వాత దాదాపు రెండు దశాబ్దాల పాటు ఒక్క చిత్రమూ వేయకుండా నిశ్శబ్దంగా ఉండిపోయేరు అమెరికాలో.

కారణాలంటూ ప్రత్యేకంగా ఏమీలేవు. అదొక మౌనయజ్ఞం. మార్పుకోసం అన్వేషణ, తపన. దానికోసం తీవ్ర ప్రయత్నం ఏదీ చేయనందున ఏర్పడిన స్తబ్దత.

ఆ స్తబ్దతను వదిలించుకుని మరలా కుంచెను చేబట్టింది 1996లో ప్రపంచ తెలుగు మహాసభల వారి సన్మానానికై హైదరాబాద్ వచ్చినపుడు మాత్రమే. అపుడలా పునరారంభమైన రామారావు కళాస్ఫ జన ఈ రెండేళ్లలో నలభై వర్ణ ఖండాల్నందించింది. ఆంధ్రదేశంలోని ముఖ్యనగరాలలోనూ, మద్రాసులోనూ ప్రదర్శితమై, త్వరలో ఢిల్లీ, బొంబాయి, కలకత్తాలలో ప్రదర్శితం కాబోతున్నాయి.

''చిత్రాలు మాట్లాడుతాయి'' అనే యస్వీ రామారావు చిత్రాల్తో మాట్లాడి చూడటం కష్టంకాదు.

అయితే ఆ మాటలు అవి అనేవీ, మనం వినేవీ కావు - మన కళ్లు మనసుతో చూడాల్సినవి.

# గ్రామదేవత - గ్రామ్యదేవతలు

కన్నడమూలం :
డా॥ యమ్. చిదానందమూర్తి

అనువాదం :
ఘట్టమరాజు

ఏ వూరికి వెళ్లినా సరే శివ, వీరభద్ర రామ, విష్ణు, ఆంజనేయస్వామి మొదలైన దేవతల శిష్టదేవాలయాలు అగుపిస్తాయి. ఇంకా ఇతర దేవతల గుళ్లూ, దేవస్థానాలని పిలువబడే రాళ్లగుళ్లూ, రంగులు పూయబడ్డ రాళ్లూ రప్పలూ, కొయ్యగూటాలు-గడలు కనపడతాయి. ఈ శిష్టేతర దేవతల్ని 'గ్రామ్యదేవత' లని పిలుద్దాం. 'గ్రామదేవత' ( ఈమెను గ్రామదమ్మ, ఊరమ్మ అని పిలవడం వాడుక) గ్రామ్యదేవతల్లో ఒకరైనా, ఆమెను విశిష్టదైవమని ప్రతిపాదించబోతున్నందున గ్రామ్యదేవత - గ్రామ దేవత అనే పేర్లను ప్రత్యేకమైన, విశిష్టమైన అర్థాల్లో పిలవాలనుకొంటున్నాను. మాహేశ్వరమ్మ, మునేశ్వరుడు, మారవ్వ, కరియవ్వ, దురుగవ్వ, హులిగవ్వ, మస్త్వమ్మ, చౌడమ్మ, అంకలమ్మ, పటాలమ్మ, వనత్యమ్మ, అణ్ణమ్మ, ఎల్లమ్మ, జోకుమారస్వామి, హొన్నాలదమ్మ, గిడ్డమ్మ, బళలికవ్వ, బీరప్ప, చిక్కమ్మ, బాణంతమ్మ ఇంకా ఆయా వూళ్ల పేర్లే కలిగిన మద్దూరమ్మ, హోసనాంబ, కిక్కేరి అమ్మ, అంతరఘట్టి అమ్మ, కోలారమ్మ, బాచళ్లి అమ్మ మొదలైన శిష్టేతర దేవతలందరూ గ్రామ్యదేవతలు.

మూలతః నిమ్నదేవాలయాలున్న[1] కొన్ని, గ్రామ్యదేవతలు కొన్ని చారిత్రక కారణాల వల్ల అభి వృద్ధి పొంది, భారతీయ ఉత్తమ సంప్రదాయ కథల సంపర్కం కారణంగా, ఉన్నతకులం వాళ్లైన లింగాయత, వైశ్యులతోపాటు బ్రాహ్మణులను కూడా అనుయాయులుగా పొందాయి. ఈ కారణాల వల్ల మహిమలున్న దేవతలగానూ రూపొందవచ్చును. మైలార, సవదత్తి ఎల్లమ్మ, బాదామి బనశంకరి, కొల్లూరి మూకాంబిక, శిరసి మారికాంబ దేవాలయాలు ఇందుకు మంచి ఉదాహరణలు.

పల్లెలోని అన్ని తక్కువ కులాల అపౌరాణిక దేవత లందరూ గ్రామ్యదేవతలే. 'గ్రామదేవత' కూడా గ్రామ్యదేవతే అయినా ఆమె ఓ ప్రత్యేకత సంతరించుకొన్న ఊరిదేవత. ఊళ్లో వుండే అన్ని తక్కువ కులాల దేవతలందరూ గ్రామదేవతలు కారు. వాళ్లు కేవలం గ్రామ్యదేవతలే. ఊళ్లోని అన్నికులాలవాళ్లూ బ్రాహ్మణులతో సహా గ్రామ్యదేవత ఉత్సవం లేదా జాతరలో ఏదో వొకరీతిగా పాలుపంచుకొంటారో ఆమె ఆ వూరి 'గ్రామ దేవత' అంటే ఏవూరికైనా కానివ్వండి, ఒకే ఒక్క గ్రామదేవత వుంటుందన్న మాట. ఊళ్లో గ్రామదేవతతో పాటు మరికొంతమంది గ్రామ్యదేవతలుండొచ్చు. కాని ఓ వూరికి ఒక్కరి కంటే ఎక్కువ గ్రామ దేవతలుండే అవకాశమే లేదు. గ్రామదేవత ఓ గ్రామానికి అధిదేవత; ఆ వూరి ప్రజల్ని రక్షించే చల్లనితల్లి. దీనికి ఓ ఉదాహరణ:

శ్రీరంగపట్టణం తాలూకా అరకెరెగ్రామంలోని బిసిల (ఎండ) మారమ్మ ఆవూరి అధి దేవత. ఆ దేవత పూజారి ఓకాపు. చుట్టూ నాలుగుగోడలు తప్ప, కనీసం పైకప్పు కూడా లేకుండా బట్టబయలులో నాటబడిన ఓ కొయ్యగూటమే బిసిల మారమ్మ (కాని ఈ దేవత ఉత్సవమూర్తి ఓ లోహవిగ్రహం). బిసిల మారమ్మపేరిట మూడువారాల పాటు జరిగే శూలం పండగ[2] సందర్భంగా కోళ్లూ, గొర్రెలు బలి ఇవ్వబడతాయి. భక్తులు నిప్పుల మీద నడుస్తారు. పండగ రోజుల్లో మారమ్మ గుడికి వేర్వేరు

---

1. దేవాలయాల్ని నిమ్మ, మధ్యమ, ఉత్తమ అని మూడు వర్గాలుగా విభజించవచ్చును. వివరాలకు చూడండి: డా॥ యమ్. చిదానందమూర్తి, ' ఉత్తర కన్నడ జిల్లెయ ఒందు దేవాలయ' అనే వ్యాసం 'పగరణ మత్తు ఇతర సంప్రబంధగళు.' మైసూరు 1984. పే. 102

దినాల్లో బ్రాహ్మణులు, కాపులు, లింగాయతులు, గాండ్ల, బెస్త, హరిజనులు మొదలైన అన్ని కులాల వాళ్ళు నైవేద్యం తెస్తారు. ఆవూళ్ళో బేటయ్య, మాస్త్యమ్మ, అజ్జి గుజ్జమ్మ, కెమ్లమ్మ, మహాదేవమ్మ, పటాలమ్మ మొదలైన గ్రామ్యదేవతలూ, చెన్నకేశవుడు మొదలైన శిష్టదేవతలున్నా ఆ పల్లె అంతటికీ బిసిల మారమ్మ మాత్రమే గ్రామ దేవత. ఆమె 'గుడి' ఊధి వాకిలి వద్దే వుంది, బిసిల మారమ్మ జాతరలో మహమ్మదీయులతో పాటు అన్ని కులాల వాళ్ళకు యథోచితమైన హక్కులూ, బాధ్యతలు వుంటాయి. మాస్త్యమ్మ, పటాలమ్మల్లా గ్రామ్యదేవత అయిన బిసిల మారమ్మ మాత్రమే అరకెరె 'గ్రామదేవత' నేటి బెంగుళూరు నగరంలో ఎన్నో పల్లెలు విలీనం అయిపోయినా, ఆ పల్లెల్లో ఒక్కోదానికీ ఒక్కో గ్రామదేవత వుండటం గమనార్హం. ఇలా వున్నా, బెంగళూరులోని మెజిస్టిక్ ప్రాంతం చాలా ముఖ్యమైనదిగా భావింపబడటం వల్ల, అక్కడ వెలిసివున్న అణ్ణమ్మ బెంగళూరు నగర 'గ్రామ దేవత'గా ఉన్నత స్థానం సంపాదించుకొంది. అణ్ణమ్మదేవత ఉత్సవమూర్తిని బెంగుళూరులోని అన్ని ప్రాంతాల ప్రజలు ధరావత్తు కట్టి తీసుకొని పోయి, వూరేగించిన తర్వాత భద్రంగా తిరిగి ఇస్తారు.

క్రమానుసారం గ్రామదేవత ఓ వూళ్ళోని అత్యున్నత దైవం కాకున్నా, ఆ వూళ్ళో చాలా ముఖ్యమైన దైవం అయి వుంటుంది. లోగడ అనుకొన్నట్లు అరకెరె గ్రామంలోని చెన్నకేశవుడు బిసిల మారమ్మ కంటే గొప్ప దేవత. అయినా వూరి ప్రజలు బిసిల మారమ్మకే అగ్రపూజ చేస్తారు. శివమొగ్గ జిల్లాలోని హిరేకోగలూరులో శివుడు, వీరభద్రుడు ఆ వూళ్ళోని కరియవ్వకంటే గొప్ప దేవతలు. ఆ దేవతల పూజాపునస్కారాలు, రథోత్సవాలు కరియవ్వజాతర కంటే వైభవోపేతంగా జరుగుతాయి. అయినా, కరియవ్వే ఆవూరి గ్రామదేవత. ఆవూళ్ళో ఎక్కువ సంఖ్యలో వున్న లింగాయతులు నిమ్న వర్గ ప్రజల దేవత అయిన కరియవ్వకు దున్నపోతును బలి ఇస్తారు. బలిపశువుగా అర్పింపబడిన దున్నపోతు మాంసంలో వూళ్ళోని లింగాయత పటేలు (వీళ్ళు ఫక్తు శాకాహారులు) కు ఓ పాలు 'హక్కు'గా సంక్రమిస్తుంది. కరియవ్వకు ఇచ్చే బలిలో అందరూ భాగస్వాములే దీనికి కారణం కరియవ్వ ఆ వూరి 'గ్రామదేవత' కావడమే.

ఓ మారు పుట్టేందుకు ముందుకాని, పుట్టిన తర్వాత కాని స్థాపించబడ్డ ఆవూరు రక్షక దేవత లేదా అధి దేవత లేదా మూల దేవతే ఆ వూరి 'గ్రామ దేవత'. అన్ని వూళ్ళలోనూ గ్రామ్యదేవతలుంటారు. కాని అన్ని వూళ్ళలోనూ గ్రామదేవత లుంటారు. ఇటీవల పుట్టుకొచ్చిన పల్లెల్లో గ్రామదేవత లుండరని భావించవచ్చు. ( ఇది కేవలం వూహ. విస్తారంగా క్షేత్రకార్యం (Field work) చేసిన తర్వాత కాని వో నిర్ణయానికి రాలేం.) ఓ వూళ్ళో మూలదేవత లేదా గ్రామ దేవత స్థాపించబడ్డ తర్వాత, ఆ పల్లెకు వేర్వేరు కులాల వాళ్ళు వచ్చి స్థిరపడి శివ, వీరభద్ర, రంగనాథ, హనుమంత దేవాలయాల్ని కట్టుకొన్నా, వూరికి వూరే ఆ గ్రామ దేవతకు అగ్రపూజ చేసే సంప్రదాయం మాత్రం నేటికీ కొనసాగుతూంది. గ్రామ్యదేవత, గ్రామదేవతలకున్న ముఖ్యమైన తేడాను జానపద విద్వాంసులు తప్పక గమనించాలి. కర్నాటకలోని అన్ని ప్రాంతాల పల్లెల్లోనూ గ్రామదేవత అనే పదం పైన చెప్పిన విశిష్టార్థంలో వాడబడుతుందన్న సంగతి గమనార్హం.

గ్రామ్యదేవతలంతా నిమ్నకులాలకు చెందినవాళ్ళు. వాళ్లను మధ్యమ, ఉన్నత కులాల దేవతల నుంచి విడదీసే మౌలికాంశాల్ని ఇలా పేర్కొనవచ్చును.[3]

---

2. వివరాలకు చూడండి: డా॥. యం. చిదానందమూర్తి 'శూలదహబ్బ'. గ్రామీణ బెంగళూరు 1977.

| | | |
|---|---|---|
| కట్టడం | - | లేదు, ఉన్నా సాధారణమైనది. |
| ఆకారమున్న విగ్రహం | - | లేదు, ఉన్నా అరుదు. |
| భక్తులు | - | మరీ సాధారణ వర్గాలకు చెందిన వాళ్లు |
| వ్యాప్తి | - | పల్లెలోని ఓ వర్గం జనులు/ కొన్ని సందర్భాల్లో కొన్ని కుటుంబాలు మాత్రమే |
| పూజ | - | లేదు. ఉన్నా అరుదు, నియమం లేదు. |
| పూజారి | - | లేడు . ఉన్నా చదువులేనివాడు |
| నైవేద్యం | - | మాంసం |
| దైవం | - | స్థానిక, కొన్ని సందర్భాల్లో చారిత్రక |
| ఆస్తిపాస్తులు | - | లేవు |
| నిర్వహణవ్యవస్థ | - | లేదు |
| లిఖిత చరిత్ర | - | లేదు |
| జానపద సాహిత్యం | - | పుష్కలం |
| భారతీయ సంప్రదాయం | - | లేదు. |

**గ్రామ్యదేవతల కొన్ని సమాన లక్షణాలు:**

1. గ్రామ్యదేవతలు చాలావరకు స్త్రీలు, పురుషదేవతల సంఖ్య కూడా చెప్పుకోదగ్గదే. కాని స్త్రీ దేవతలతో పోలిస్తే చాలా తక్కువే. 'గ్రామదేవత'గా పురుషదేవత లెవ్వరూ లేరు.

2. గ్రామ్య దేవతల పేర్లన్నీ చాలామటుకు ద్రావిడపదాలు. దుర్గవ్వ, కాళవ్వ - ఇలాంటి కొన్ని పేర్లలో సంస్కృతనామాలు ( దుర్గ, కాళి) దాగివున్నా, వాటికీ ఆర్యదేవతలకూ ఎలాంటి సంబంధమూ లేదు. గ్రామ్యస్త్రీ దేవతలందరూ శక్తిలేదా దుర్గల అవతారమని విద్యావంతుల అభిప్రాయం. పల్లీయుల దృష్టిలో ఆదేవతలు శివుని భార్య పార్వతి అవతారం. ( శివుడు మూలతః ద్రావిడుల దైవం)

3. గ్రామ్యస్త్రీ దేవతలు విధవలన్న కథలు ప్రచారంలో వుండటం సామాన్యం.

4. శిష్టదేవతలకు పొగడ్తలు ఇష్టం, గ్రామ్యదేవతలకు తిట్లు, అశ్లీలభాష చాలా ఇష్టం. శిష్టదేవతలకు శాకాహారం నైవేద్యమైతే, గ్రామ్యదేవతలకు మద్యమాంసాలు ఇష్టం. గ్రామ్యదేవతలకు నగ్నపూజ, వేపమండల సేవ లాంటివి ఇష్టం.

5. ప్రజలకు గ్రామ్యదేవతల పట్ల భక్తిశ్రద్ధల కంటే భయం ఎక్కువ. ఈ సందర్భంగా Henry Whitehead చెప్పిన మాటలు గమనించదగ్గవి.

"Shiva and Vishnu represent forces of nature: Shiva symbolises the power of destruction and the idea of life turough death, Vishnu the power

3. వివరాలకు మొదటి పాదసూచికను చూడండి.

of preservation and the idea of salvation. Both these deities and the system of religion connected with them are the outcome of philosophic reflection on the universe as a whole. But the village deities, on the otherhand, have no relation to the universe. They symbolize only the facts oÐèþ village life. They are related not to the great world forces but to such simple facts as cholera small fox and cattle diseases."[4]

గ్రామ్య దేవతలు ముఖ్యంగా వాన, పంటలు, పిల్లలు, కలరా లాంటి రోగాలు, కరువు, వూరు పొలిమేర మొదలైన జీవితవాస్తవికతలకు సంబంధించి వుంటారు.

ప్రజలు గ్రామ్యదేవతల్ని పూజించేది భక్తితోకాదు, భయంతో, ప్రాకృతికశక్తుల్ని వుపశమింప చేసేందుకు, వాళ్ల కోపాన్ని శాంతింప చేసేందుకు ప్రజలు గ్రామ్యదేవతల్ని కొలుస్తారు.

గ్రామ్యదేవతల అధ్యయనం చేశాక వెల్లడయ్యే కొన్ని అంశాల్ని ఈ విధంగా పేర్కొనవచ్చును.

1. నేటి గ్రామ్యదేవతలు చాలావరకు స్త్రీలు, పైగా విధవలు, ప్రాచీన ద్రావిడుల మాతృస్వామ్య కుటుంబ పరిణామం వల్ల అలా జరిగింది. మాతృస్వామ్య కుటుంబంలో పురుషుడు పిల్లల్ని పుట్టించేందుకు ఓ సాధనం మాత్రమే. స్త్రీ భర్తను కోల్పోతే, మరో పురుషుడు జత అవుతాడు. నేటి గ్రామ్యదేవతల పరిశీలన ప్రాచీన ద్రావిడ కుటుంబవ్యవస్థను అర్థం చేసుకొనేందుకు తోడ్పడుతుంది.

2. ద్రావిడుల ముఖ్యవృత్తి వ్యవసాయం. వ్యవసాయరంగంలో పురుషుల కంటే స్త్రీల భాగస్వామ్యమే ఎక్కువ. స్త్రీ గ్రామ్య దేవతల ప్రాబల్యానికి ఇదీ ఓ కారణం కావొచ్చు. ద్రావిడ గ్రామ్యదేవతల్లో చాలామంది ఫలోత్పత్తి (Fertility) దేవతలు. నగ్నపూజ, తిట్లపాటలు మొదలైన ఆచరణల్ని ఈ నేపథ్యంలో వివరించవచ్చు.

3. 'గ్రామదేవత' వూరి అధి దేవత. నేటి రోజుల్లో గ్రామదేవత ఓ వూరి అతి ముఖ్యదేవత కాకున్నా, పేరుమోసిన దేవత కాకున్నా, వైభవోపేత పూజలు అందుకోలేకున్నా, ఆ వూరి రక్షకదేవత. ఊరంతటికీ దైవం, ఆమె నిమ్నజాతుల ఇంటిదేవతే అయినా, వూళ్లోని అన్ని వర్గాల ప్రజలు ఆమె ఉత్సవంలో పాల్గొంటారు. గ్రామదేవత విగ్రహాలు తూర్పువైపుముఖం చేసి వుంటాయి. సామాన్యంగా వూరిప్రవేశద్వారం వద్ద స్థాపింపబడి వుంటాయి. ఒకవేళ కాలక్రమంలో వూరిస్వరూపమే మారిపోయి వుంటే, వూరి మూలస్వరూపాన్ని వూహించేందుకు 'గ్రామదేవతల' గుళ్లు తోడ్పడతాయి.

4. మిగతాచోట్ల లాగానే గ్రామ్యదేవతల విషయంలోనూ సంస్కృతీకరణ జరిగింది. ఆ కారణంగా కొన్ని చోట్ల గ్రామ్యదేవతలకు సంస్కృతపు పేర్లు సిద్ధించాయి. సాత్వికమైన లేదా శాస్త్రోక్తపూజలు జరుగుతాయి. సంస్కృతీకరణం ఎంత సాగినా, గ్రామ్య దేవతలు తమ ప్రాచీనతను కాపాడుకొని వుంటాయి. మానవశాస్త్రవేత్తలకు, జానపద విద్వాంసులకు గ్రామ్యదేవతల నిశిత పరిశీలన చాలా స్వారస్యకరంగా వుంటుంది. అలాంటిపరిశీలన పురాతన మానవజాతి గురించి కొత్తవెలుగులు ప్రసరింప చేయగలుగుతుంది.

4. *The village Gods of South India*. New Delhi. 1983. Page 17.

# భారతీయతత్త్వశాస్త్ర చరిత్ర - వేదాంత దర్శనం

- శివలింగం

భారతీయ తత్త్వ శాస్త్ర చరిత్ర పాఠకలు ఆదినుంచి భారతదేశంలో వేదంతానికే ప్రాధాన్య మిచ్చారని భావించడానికి అవకాశం కల్పించే విధంగా తత్త్వశాస్త్ర చరిత్ర లిఖించారు. భారతీయ పునర్వికాసోద్యమకాలంలో. స్వాతంత్ర్యానికి పూర్వం భారతదేశం అన్ని దేశాల కన్నా ముందే కళ్ళు తెరిచిందని గొప్పలు చెప్పుకునే పరిస్థితి. స్వాతంత్ర్యానంతరం సాహిత్యం, కళ, చరిత్ర, తాత్త్విక రంగాలలో పునరాలోచన తలెత్తింది. ఆవేశంలో పొంగి పొగడకుండా ఆలోచనతో నిదానంగా హేతుబద్ధంగా విచారణచేయడం ఆరంభించారు. అన్నీ గొప్పగా కనబడినవి ఇప్పుడు చప్పగా వుంటున్నవి. కొన్ని అతిశయోక్తిగా కనిపించాయి.

శంకరునికి ముందుగాని తరవాత కొంతకాలం వేదాంత దర్శనం బలీయంగా కనిపంచడంలేదు. వేదాల చివరి భాగాలు ఉపనిషత్తులనడం సరికాదు. క్రీ.శ. 13వ శతాబ్దం వరకు ఉపనిషత్తులు వెలువడుతూనే వున్నాయి. వేదాంతం ఉపనిషత్తుల్లో చెప్పిందే అయితే బుద్ధునికాలానికి ముందే అస్తిత్వం పొందిందింది. బృహదారణ్య, ఛాందోగ్యాలు బుద్ధునికి ముందే, ఉపషత్తత్త్వాన్ని తెలిపే బ్రహ్మసూత్రాలు చాలామంది రచయితల్ని పేర్కొంది. వాళ్ళు సైద్ధాంతికంగారాశారో లేదో తెలియదు. బాదరాయణుడు బ్రహ్మ సూత్రాలు కూర్చింది క్రీ.శ. 50, బ్రహ్మ సూత్రాలే చాలా ప్రాచీన గ్రంథం. శంకరునికి ముందు వేదాంత దర్శనా చార్యులు వున్నారు. అయిదుగురు వారు

బోద్ధాయనుడు (350) క్రీ.శ. ద్రమిడాచార్యుడు (525) భార్తృ ప్రపంచ (550) విశ్వరూపదేవ (600) బ్రహ్మదత్త (660)

వీరు బ్రహ్మసూత్రాల మీద భాష్యం రాసినవారు. కాని వారి గ్రంథాలేవీ కనబడలేదు. ద్రమిడాచార్యుడు బేదాభేదవాదాన్ని (Difference-cum-identity) ప్రబోధించాడని శంకరుడు ద్రమిడాచార్యుడినే అనుసరించాడని కుప్పస్వామి శాస్త్రిగారంటారు. శంకరుడు బోధాయనుడిని పేర్కోలేదు. రామానుజుడు వేదార్థ సంగ్రహంలో బోధాయనుడు, తంక, ద్రమిడులతో పాటు కొంతమంది వేదవేదాంతాలమీద రాసిన ప్రాచీనాచార్యుల్ని ఉదాహరించాడు. బ్రహ్మసూత్రాలమీద బృహద్భాష్యం (వృత్తి) రాసి వుంటారు. బోద్ధాయనుడు. తరువాత ఆచార్యులు దాన్ని సంక్షిప్తం చేశారని రామానుజుడు. యమున, రామానుజ, వేదాంత దేశికులు రచనల్లో ద్రమిడాచార్యుని ఉదాహరించారు. బృహదారణ్యం మీద భాష్యం రాశాడు భాత్తృప్రపంచ. ఈశ, చాందోగ్యాల మీదారాశాడు. కాని ఒక్కటీ దొరకలేదు. బ్రహ్మదత్తుడూ రాశాడు బ్రహ్మసూత్రాలమీద భాష్యం. యమునాచార్యుడు సిద్ధిత్రయంలో పేర్కొన్నాడు. అదీ దొరకలేదు. ద్రమిడా చార్యుడు-గాని భార్తృ ప్రపంచుగాని భేదాభేదవాదులు. జీవ బ్రహ్మల ఐక్యాన్ని చెప్పారుగనుక అద్వైతులుగానే భావించడం జరిగింది. ఇతరులు చెప్పినవే గాని వారి గ్రంథాలేవీ దొరకలేదు. శంకరుడు వచ్చేవరకు వేదాంతానికి అధిక ప్రాధాన్యత లేదని చెప్పవచ్చు, అసలు లేదనడం సరికాదు. బ్రహ్మ సూత్రాలను సైద్ధాంతీకరించడానికి అంగీకరించకపోయి వుండొచ్చు. పురాణేతిహాసాలను తీసుకున్నట్టయితే

సాంఖ్య వేదాంతాలు హిందూ జనాకర్షక తత్వాలుగా కనిపిస్తున్నాయి. క్రీ.శ. ప్రథమ సహస్రాబ్దంలో బౌద్ధం విశేష జనాకర్షణ పొందిందనడంలో సందేహంలేదు. అంతమాత్రాన హిందూ తత్త్వం తక్కువదనో గొప్పదనో చెప్పలేం. దర్శనాలు ఆరు అని ఎప్పుడు నిర్ధారించారో తెలియదు. దర్శన గ్రంథాల్లో వేదాంత దర్శనంలేదు. హరిభద్రుడే కాదు మాధవుని సర్వదర్శన సంగ్రహంలోనూ వేదాంతం చేర్చ లేదు. శంకరుని అద్వైతం కన్నా ముందే బౌద్ధ దర్శనాన్ని చాలాబాగా హేతుబద్ధంగా క్రమ బద్ధీకరించారు. ప్రాచీన కాలంలో వేదాంతం పూర్తిగా విస్మరించబడింది. శంకరుని తరువాత 12 వ శతాబ్దంవరకు వేదాంత దర్శనానికి ఉచ్ఛస్థితి. తరవాత వేదాంతానికి ఎదురుద్దీగా నవ్యన్యాయం నిలిచింది. బుద్ధుడు గురువులైన ఆరాడకాలవముడుగాని, రుద్రుకరామపుత్రుడుగాని సాంఖ్యయోగాలను బోధించారే గాని వేదాంతాన్ని కాదు, బ్రహ్మజాల సుత్తంలో 62 సిద్ధాంతాలు అనాటికి వున్నట్టు కనిపిస్తూంది. క్రీ.పూ 4వ శతాబ్దం చివరివాడైన కౌటిల్యుని అర్థశాస్త్రంలో సాంఖ్య. యోగలోకాయతాలనే విద్యలుగా చెప్పాడు. బుద్ధుడు, మహావీరులకు ముందుదే సాంఖ్యం. ఛాందోగ్యంలోనే సాంఖ్యం వుందంటారు. సాంఖ్యం అవైదికం. మక్కలి గోసాల, పురాణ కాశ్యప, అజితకేశకంబళి పకుధ కాత్యాయన, సంజయ వేలత్తి పుత్త వంటి వారు అవైదిక, నాస్తిక సిద్ధాంతాలను ప్రభోదించడాన్ని బట్టి. క్రీ.పూ 6వ శతాబ్దం వచ్చేసరికి వైదిక సంప్రదాయ అధిపత్యం తగ్గిపోయింది. అరణ్యకాలు, బ్రాహ్మణాలలోని యజ్ఞాలు, అనేక విషయాలమీద ఉపనిషత్తుల్లో చర్చలు వాదోపవాదాలు జరుగుతున్నాయిగాని ఒకేవేదాంత విషయం మీద మాత్రమే దృష్టిని కేంద్రీకరించడం లేదు. భారతీయ తత్త్వ శాస్త్ర చరిత్ర కారులు వేదాంతం మాత్రమే అధిపత్యం వహిస్తున్నట్టు రాస్తారు. అవైదిక దర్శనాలు పెరిగి వేదవాదులు తరిగిపోతున్న కాలంలో బాదరాయణుడు వేదాంతం నిలబెట్టడం కోసం బ్రహ్మసూత్రాలు-(వేదాంత సూత్రాలు) రాయడం జరిగింది. మహా భారత కాలంలో కూడా సాంఖ్య యోగాలకే పెద్ద పీట వేశారు. మాండూక్య కారిక రాసిన గౌడపాదుడు క్రీ.శ. 6 వ శతాబ్దివాడు. గౌడపాదునిమీద బౌద్ధ ప్రభావం గాఢంగావుంది. అద్వైత వేదాంతి గౌడపాదుడు స్వతంత్ర ఆలోచనా శీలి. శంకరుడిని అకర్షించింది. హస్తామలక, త్రోటక, పద్మపాద, సురేశ్వర, మండనమిశ్రులు శంకరుని శిష్యులు, శంకరానంతర వేదాంత దార్శనికులు ఇంకా భాస్కరుడు గోపాలా శ్రమ క్రీ.శ. (780) జ్ఞానఘన (900), జ్ఞానోత్తమ భట్టారక (930) విముక్తాత్మ (960) వాచస్పతి మిశ్ర (960), ప్రకాశాత్మన (975) జ్ఞానోత్తమ మిశ్ర (980). ఎనిమిదిమంది వున్నారు. క్రీ.శ. ప్రథమ సహస్రాబ్దంలో 117 మంది బౌద్ధాచార్యులు, 27 మంది జైనాచార్యులు, న్యాయవైశేషికాచార్యులు 13 మందిగా లెక్కించారు

**జైన, బౌద్ధ దర్శనాలు :**

నాగార్జునుడు (150) ప్రథమ మహా మాధ్యమిక దార్శనికుడు: బ్రహ్మ సూత్రాలను గురించి గాని వేదాంత ప్రస్తావనగాని తీసుకు రాలేదు. అప్పటికి సూత్రాలు వెలువడి వందేళ్ళు, నాగార్జునుని శిష్యుడు ఆర్యదేవుడు (180) గాని యోగాచార్యులు మైత్రేయ నాధుడుగాని అసంగుడు (360), వసుబంధు (360) గాని బ్రహ్మ సూత్రాలను పట్టించుకోలేదు. ఇతర దర్శనాలను న్యాదర్శనాన్ని

చర్చించారు. శంకరునికి తరువాత వాడైన శాంతరక్షితుడు పురుషుడు ఆత్మలను చర్చించాడు. శంకరుని ప్రస్తావించ లేదు. శాంతక్షితుని తత్వ సంగ్రహం మీద భాష్యం రాసిన కమల శీలుడూ అంతే, బౌద్ధ దర్శనం 150 నుండి 1200 వరకు విస్తరించింది. శ్రుతి అంతిమ సత్యాన్ని ప్రతిపాదిస్తుందని కాదు. శ్రుతే అంతిమ సత్యం అనే భావన నుండి తప్పించారు. శ్రుతికి తర్కానికి సంబంధం లేదన్నారు. బౌద్ధాన్ని శూన్య వాదం, విజ్ఞాన వాదం,వైభాషిక శ్రౌతాంత్రిక అనే నాలుగు దార్శనిక ధోరణులుగా విభజించవచ్చు. చరిత్రకారులు గౌతముడు, జైమిని, కణాదుడు, బాదరాయణుల కిచ్చిన ప్రధాన్యతగాని ప్రతి పత్తిగాని బౌద్ధ దార్శనికులైన నాగార్జునుడు అసంగుడు వసుబందులు అంత గొప్పవారైనా యివ్వలేదు. ఎవరికి వారు స్వతంత్రమైన ఆలోచనా శక్తితో తమసిద్ధాంతాలను నిర్మించు కున్నారు గాని వారికి ముందున్న సంప్రదాయాన్ని కొనసాగించిన వారు కాదు. శ్రమణ సంప్రదాయం గురించి చర్చించలేదు. ఆస్తిక దర్శనాలకున్నా గౌరవం శ్రమణ దర్శనానికి లేదు. 1200 సంవత్సరంలో భక్తి యార్ ఖిల్జీ నలందా విశ్వవిద్యాలయాన్ని ధ్వంసం చేశాక బౌద్ధం భారతదేశంలో అంతరించింది. బౌద్ధ తత్త్వ శాస్త్ర చరిత్ర తిరిగి రాయాలి. జైనా చార్యుడు హరిభద్ర సూరి (750) షడ్దర్శన సముచ్చయం విలువైన గ్రంథం. బౌద్ధ, న్యాయ, సాంఖ్య జైన, వైశేషిక, మీమాంస దర్శనాలను షడ్దర్శనాలుగా చెప్పాడు. వేదప్రమాణాన్ని అంగీకరించేవి ఆస్తిక దర్శనాలని, అంగీకరించనివి, నాస్తికదర్శనాలని వివరించాడు. ఆస్తిక దర్శానాలు - న్యాయ, వైశేషిక, సాంఖ్య యోగ పూర్వ మీమాంస ఉత్త ర మీమాంస నాస్తిక దర్శనాలు - జైన, బౌద్ధ, చార్వాకాలు.

హరిభద్ర సూరి వేదాంత దర్శనాన్ని చేర్చలేదు. వేదాంతం ఈ కాలం నాటికి ఒక ఆలోచనా విధానంగా రూపొందలేదను కోవాలి. పాండిత్యాన్ని ప్రదర్శనగా సమాజంలో ఒక అధిపత్యానికి చిహ్నంగా రాజాస్థానాల్లో పదవి కోసం డబ్బు కోసం వాద ప్రతి వాదాలు చేయడం వేదాంతుల్లోనే ఎక్కువగా వుండనడానికి శంకురుని దిగ్విజయ యాత్ర ఉదాహరణగా పేర్కొన వచ్చు. బౌద్ధ పండితుల్లో లేదు. ఉజ్జయినిలో పాశుపతాచార్యుడిని శంకరుడు ఓడించానడం కట్టుకథ. ఇరువురూ శైవులే. శంకరుని తరవాత రాజులు శైవ మతావలంబకులు కావడం నుంచి అద్వైతానికి ఆదరణ లభించింది. అస్సాంలో రత్న పాలుడు, బెంగాల్లో, విజయ సేనుడు భల్లాల సేనులు, గదవహల్ రాజులు, కాశీ కనోలా, గుజరాత్ చాళుక్యులు ఉజ్జయినిలో భోజుడు, కళ్యాణిలో పశ్చిమ చాళుక్యులు, చోళులు పాండ్యులు వీరశైవులు, దక్షిణ దేశంలో శైవ మతాన్ని ఆదరించారు. గుప్తుల అనంతరం వైష్ణవం సన్నగిల్లింది. దక్షిణదేశంలో అద్వైతం ఉచ్ఛస్థితి పొందింది.

వైశేషిక, న్యాయ సూత్రాలు కూడా బ్రహ్మ సూత్రాలను పట్టించుకోలేదు. వైశేషిక సూత్రాలు వేదాంతాన్ని ఖండించాయి. ఒకటి రెండు సార్లు న్యాయ సూత్రాలు అది కూడా చేయలేదు. వైశేషిక సూత్రాలు. బ్రహ్మ సూత్రాలకు సమకాలీనమేనని రాధాకృష్ణన్ అన్నాడు. న్యాయ సూత్రాలు బ్రహ్మ సూత్రాకన్నా ముందే వచ్చాయంటున్నారు జయంత భట్టు, ఉదయనుడు అద్వైతాన్ని ఖండించారు గాని శంకరుని పేరు చేర్చలేదు.

యోగసూత్రాలు క్రీ. శ. 400 ప్రాంతంలో పతంజలి కూర్చాడు. యోగసాధనాలు అతి ప్రాచీన కాలంనుంచి అంటే ఉపనిషత్తులు, మహాభారతం, భగవద్గీత, జైనం, బౌద్ధాలలో యోగసాధనలున్నాయి. హరి భద్రుడుకి తెలిసివుండవచ్చు కాని ఒక దర్శనంగా గుర్తించలేదు. సాంఖ్యం నుండి స్వీకరించింది యోగం. ప్రథమ సాంఖ్య గ్రంథంగా షష్టి తంత్రం అంటారు, సాంఖ్య కారికలు క్రీ.శ 350 లో రాయబడ్డాయి. సాంఖ్య కారికలకు విశేష ప్రాధాన్యత గుర్తింపు కలిగాయనడంలో సందేహంలేదు. అద్వైతవేదాంతానికి ప్రధానమల్లుడు సాంఖ్యమని శంకరుడన్నాడు. భారతదేశంలో ఆస్తిక నాస్తిక దర్శనాల్లో ఈశ్వరుడు, కర్మ, పునర్జన్మ జీవుడు, ఆత్మ, వంటి పదాలను వాటి గురించిన విచారణ వున్నప్పటికి వేదాంత దర్శనం ఒక సిద్ధాంతంగా ఒక ధోరణిగా క్రీ.శ. 1000 నాటికి అస్తిత్వం పొందలేదు. తరవాత కాలంలో అద్వైత ధోరణిదే అగ్రస్థానం. 19వ శతాబ్దంలో అద్వైతం బలమైన సిద్ధాంతంగా స్థిరపడింది. తత్త్వశాస్త్ర రచనలు చేసినవారు అద్వైత తత్త్వాభిమానలుగావడం వలన నిష్పాక్షికంగా రాయలేదు. బౌద్ధతత్త్వ చార్యుల దృక్పధాలను వివరించడం జరగలేదు. విపుల సమీక్షాత్మకంగా development of ideas ను వివరించాలి. వేదాంతం ఒక్కటే భారతీయ తత్త్వంగా పేర్కొనడం సరికాదని మనకు అర్థమవుతున్నది. ఈ విషయంమీద మరింత విపులమైన చర్చ జరిగినపుడు యదార్థ విషయాలు వెల్లడవుతాయి. భారతీయ తత్త్వ శాస్త్ర చరిత్రను పునర్నిర్మించు కోవాల్సి వుంటుంది.

## "A CIVILISED MAN"

No less revealing is the author's account of our Ambassador, S. Radha krishnan's meeting with Stalin. His ignorance of the region was appalling. Did India have a navy? Radhakrishnan answered in the affirmative and "professed the information that India also had an air-force." The author continues "Another surprising question followed, which was why Ceylon was not a part of India, to which no explanation could be offered beyond saying that it was and had been a separate country. To the enquiry as to whether the Maldives belonged to India, I recall with some regret that we were both stumped; to evade the issue we mumbled disingenuously that the Laccadives were part of India."

It was to this worthy that four communist leaders — Ajoy Ghosh, S A Dange, C Rajeshwar Rao and M Basavapunniah — repaired, in secret in 1951 to obtain guidance on the line the then united Communist Party of India should follow.

From: "A life of our Time" by Reajeswar Dayal, Orient Longman Rs. 495/-

# తెలంగాణా వచన కవిత్వం

(గత సంచిక తరువాయి)

- సీతారాం

తెలంగాణా కేవలం భౌగోళిక ఎల్లలతో గుర్తించదగిన ప్రాంతం కాదు. అభివృద్ధికి దూరమైనందున వెనకబాటు తనాన్ని ప్రదర్శించే ప్రాంతమూ కాదు. ఎవరి స్వార్థ ప్రయోజనాలో గుర్తొచ్చినప్పుడల్లా వారి వారి గొంతులు ప్రత్యేక రాష్ట్రం కావాలని నినదించినప్పుడు ఉలికిపడ్డ ప్రాంతమూ కాదు. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం మొదలై, మొదలైనచోటే అంతమై, మళ్ళీ మొదలై మళ్ళీ అంతమై ఇప్పటికీ నోరు మెదపని ప్రాంతమే తెలంగాణా. తెలంగాణా ఒక సజీవ పోరాట తత్వానికి పర్యాయపదం. తెలంగాణాది రాజ్యవ్యతిరేక స్వభావం. అదిప్పుడూ సాగుతూనే ఉంది. ప్రత్తిరైతుల ఆత్మహత్యలలోనూ ఈ స్వభావం కనిపిస్తుంది. తెలంగాణా రైతులది నిరసన. రాజ్యం మీద భ్రమలు తొలగిన నిరసన. తన సర్వప్రయోజనాలనూ ప్రక్కన పెట్టగల ఔదార్యం తెలంగాణాది. ఇటువంటి ప్రశంసలు తెలంగాణా గురించి ఎన్నైనా చేయవచ్చు.

అయితే అదిక్కడ అంతముఖ్యం కాదు. ఎన్నోరకాల వైరుధ్యాలు, సామాజిక వైవిధ్యాలతో కొనసాగుతున్న తెలంగాణా ప్రాంతం నుండి వచ్చిన వచన కవిత్వం గురించి మాట్లాడటం ప్రస్తుత సందర్భంలో అవసరం. ఇన్నాళ్ళూ ప్రధాన సాహిత్య స్రవంతిలో ఉండి ఇప్పుడు హఠాత్తుగా ఈ 'పాయ'ను వేరుపరచి చూడటం ఎందుకు? ప్రధాన సాహిత్య స్రవంతిలో భాగం అయినంత మాత్రాన ఒక ప్రాంతం నుంచి పుట్టిన సాహిత్యం, దాని సాధారణ లక్షణాలు, ప్రత్యేక స్వరూప స్వభావాలు మరుగునపడిపోవాలా? ఇప్పటికే మరుగున పడిపోయిన అనేకాంశాలను వెలికి తీయడం ఎంతయినా అవసరం. ఒక్కమాటలో చెపితే గత యాభై ఏళ్ళ కాలంలో తెలంగాణా ప్రాంతం నుంచి వచ్చిన వచన కవిత్వం విశిష్టతను గుర్తించడం ఇక్కడ ప్రధానం. అదే విధంగా 'ప్రధాన సాహిత్య స్రవంతి' అనే ఇనుపతెర వెనుక తెలంగాణా వచన కవిత్వ స్థితిగతులను, మెరుగు తరుగులను చర్చల్లోకి తేవడమే ఈ వ్యాస లక్ష్యం.

'తెలంగాణా వచన కవిత్వం' అనేమాట చాలా మందికి కటువుగా వినిపించవచ్చు. సాహిత్యాన్ని లేదా కవిత్వాన్ని 'సువిశాల' దృష్టికోణం నుండి చూడాల్సి ఉండగా సీమితం చేయడం ఎంతవరకు సబబు? అనే ప్రశ్న రావచ్చు. చూడటం వల్ల నష్టమేమిటి అనే ఎదురు ప్రశ్న వేయవచ్చు.

ఒక ప్రాంతం నుండి కవులు అధిక సంఖ్యలో కవిత్వ పరమైన కృషి జరుపుతూ ఉన్నప్పుడు ఆ కృషిని గుర్తించడానికి, ఆ కృషి వెనకనున్న చైతన్యం గురించి తెలుసుకోవడానికి ఆయా కవులను, కవిత్వాన్ని సీమితం చేసి మాట్లాడక తప్పదు. సాహిత్యంలో నిర్దిష్ట ప్రాంత విభజన జరగటం మొదలుపెడితే ఎక్కడికి చేరతాం? ప్రాంతీయ, జిల్లాలు, మండలాలు, గ్రామాలు, వీధులు - 1 ప్రతి వీధికీ ఒక నుడికారముంటుంది' అని ఓ కవి అన్నట్లు ఈ నిర్దిష్టత ఏ మేరకు? దీని పరిమితులేమిటి? ఇటువంటి నిర్దిష్టతా చట్రంలోకి ఒకసారి మనమే సుముఖులమై ప్రవేశించాక రేపు ఉత్తర తెలంగాణా జిల్లాలు, దక్షిణ తెలంగాణా జిల్లాలు అనేది ముందుకొస్తే? అలాగే ఉత్తర తెలంగాణా జిల్లాలలోనే గిరిజన సంస్కృతి అధికంగా ఉన్న జిల్లా, గిరిజన సంస్కృతి లేని జిల్లా అనిగానీ, దక్షిణ తెలంగాణా విషయానికొస్తే పట్టణ సంస్కృతికి సమీపాన ఉన్నవీ, అట్లాలేనివీ అనే విభజన కూడా జరగవచ్చు. అలాగే తెలంగాణేతర ప్రాంతాల సంస్కృతీ ప్రభావాలతో పెరిగినందువల్ల వచ్చిన సాంస్కృతిక ఆధిక్యత గల జిల్లాలు అదిలేని జిల్లాలు అనే విభజనా చేయవచ్చు. ప్రతి ప్రశ్ననూ అంగీకరించి ఆమేరకు సమాధాన రూపంగా ఈ విభజన పరంపరను కొనసాగదీయవచ్చు.

నిజానికి ఇటువంటి ఆలోచన చేయాల్సిన పరిస్థితి ఎందుకొచ్చింది? మార్చి 2,3 తేదీలలో

కాకతీయ విశ్వవిద్యాలయ తెలుగు విభాగం 'తెలంగాణా సాహిత్యం' పేరిట ఒక జాతీయ సదస్సును నిర్వహించింది. సదస్సులో సమర్పించిన పత్రాలన్నీ తెలంగాణా ప్రాంత సాహిత్యం, సాహిత్య ప్రక్రియలకు సంబంధించినవే. అందులోని ఒకానొక పత్రమే 'తెలంగాణా వచన కవిత్వం'

సదస్సుకు సంబంధించి ఒక 'అవగాహనా పత్రం' కాత్యాయని విద్మహే అందించారు. కానీ అందులో ప్రాంతాలవారీగా సాహిత్యాన్ని ఎందుకు విడగొట్టి చూడాలి? అనే ప్రశ్నకు సమాధానం స్పష్టంగా లేదు. ఒకవేళ ఉన్నట్లు అనిపించినా ఆ అవగాహనా పత్రాన్ని 'between the lines' చదవటం ఎంతయినా అవసరం.

వాస్తవానికి ప్రాంతీయ దృష్టికోణం నుంచి సాహిత్యాన్ని విడగొట్టి చూడటం ప్రస్తుతం సమస్యేనా? సమస్య అయినా కాకపోయినా విడగొట్టడం వల్ల పుట్టే కొత్త సమస్యలు ఏమిటి? కొత్త సమస్యలు ఉత్పన్నమైతే వాటినెలా అధిగమించాలి? ఎట్లా పరిష్కరించాలి? ఈ రెంటికీ తేడా ఉంది, అధి గమించడం అంటే వ్యూహాత్మకంగా సమస్యను దాటవేయడం. పరిష్కరించడమంటే సమస్యను లేకుండా చేయడం.

కొంచెం యధార్థాన్ని మాట్లాడితే ఇప్పుడు ఈ 'తెలంగాణా వచన కవిత్వం' అనే మాట గానీ, 'తెలంగాణా సాహిత్యం' అనే సదస్సు గానీ, ఆశించే ప్రయోజనం ఏమిటి? ఈరోజున సామాజికంగా రాజకీయంగా తెలంగాణా గురించి జరుగుతున్న చర్చల్ని బట్టి ఆలోచిస్తున్నామా? అలా అయ్యేట్లయితే జరిగే రాజకీయ, సామాజిక చర్చలు ఎన్ని మలుపులు తిరగితే మనమూ అన్ని మలుపులు తిర్గగలమా? ఈ ప్రశ్నలు అటు తెలంగాణా కవులకూ, తెలంగాణేతర కవులకు సహజంగానే కలుగుతాయి. ఇప్పటికే ఈ ప్రకంపనలు మొదలయ్యాయి.

తెలంగాణాలో వచన కవిత్వం ఆధునిక ప్రక్రియగా నిలదొక్కుకునేందుకు ఒక దశాబ్ది కాలం పట్టింది. దీనిని కవిత్వ రూపాన్వేషణ దశగా గుర్తించాలి. 1950-60 మధ్య కాలంలో వచ్చిన కవిత్వం అంతా రూపాన్ని వెతుక్కుని, దానిని స్థిరపచుకోవటం మీదే దృష్టి నిలిపింది. అయితే ఈ క్రమం 1948 తరువాత మొదలైనట్లు కనిపిస్తుంది. దాశరథి 'పునర్నవం' వెలువడినాక గుర్తించదగిన రూపాన్ని వచన కవిత్వం తీసుకుంది. 'పునర్నవం' నుండి 1960లో జగన్నాథం గారి 'సాగరసంగీతం' వెలువడే దాకా వచన కవిత్వానిది రూపాన్వేషణా దశ అనే చెప్పాలి. దీనినే వచన కవిత్వావిర్భావ వికాస ప్రయత్న దశ అనవచ్చు.

ఈ మొత్తం దశాబ్దంలో వచ్చిన కవిత్వ సంపుటాలు, విడిగా కవులు ఒకటీ అరా ఖండికల ద్వారా చేసిన సఫలంకాని యత్నాలు, ఇదే కాలంలోనే జరిగిన రాజకీయ, సామాజిక, పరిణామాలనేపథ్యం ఇవన్నీ ఒకే విషయాన్ని రుజువు చేస్తాయి. ఈ దశాబ్దంలో కవులది సంశయ స్థితి. ఒక ప్రక్రియగా వచన కవిత్వాన్ని స్వీకరించాలా వద్దా అనే సంశయం ఇందులో ప్రధానం

కవులుగా ఆలోచన చేస్తే దాశరథిది మొదటి స్థానం. తన 'పునర్నవం' లో వద్యం, గేయం. వచన కవిత్వం సమానంగా కనపడతుంది. 'పునర్నవం' అని పెట్టిన దాశరథి రూపపరంగా ముందుకు పోవడానికి సంశయించబట్టే కొంత పద్యం, కొంత గేయం మిగిలింది వచన కవిత్వంగా రాశాడు. ఇక మాదిరాజు రంగారావు 'కిర్మీరం' 'యుగసంకేతం', 'మానవీయం' మొదలైన సంపుటాలను ఈ దశబ్దిలోనే ప్రకటించారు. మొదటినుంచీ వచన కవిత్వరూపాన్నే ఈయన ఆశ్రయించారు. ఇక జగన్నాథం 'సాగరసంగీతం' లో గేయ పద్ధతిలో సాగిన రచనలు, వచన రూపంలో ఉన్న కవితలు కనిపిస్తాయి. ఈ

దశాబ్దంలోనే సినారె గేయ కవిగా ప్రసిద్ధి పొందారు. ఇంకా అనుముల కృష్ణమూర్తి, చేరా, బాపురెడ్డి, జె.వి. రాఘవేంద్రరావు మొదలైన వారు సాగించిన ప్రయత్నాలున్నాయి. ఈ ప్రయత్నాలు రూపాన్వేషణ దిశగా సాగాయని చెప్పడం సబబు. పద్యం, గేయం, వచన కవిత్వం ఏది రాసినా ఫర్వాలేదు అనుకున్నట్లు ఈ కవుల ప్రయత్నాలు చెపుతున్నాయి. సుప్రసన్న, సంపత్కుమారలు పద్యం, వచన కవిత్వం రెంటినీ సమ దృష్టితో చూచినట్లు కనిపిస్తుంది. అయితే వీరి మొగ్గు పద్యం వైపే ఉంది. వచన కవిత్వం నాలుగు దశాబ్దాలుగా కొనసాగుతున్నా వీరి నుంచి పద్యసంపుటాలు ఈ నాటికీ వస్తుండటం ఈ విషయాన్ని ధృవపరుస్తోంది. దాశరథి చూపిన మార్గం ఈ కవులకు అనుసరణీయమైంది. అందునా విశ్వనాథ మార్గం పట్ల అన్ని కోణాలనుంచీ వీరికి ఆకర్షణ ఎక్కువ. దాశరథికి ఉన్న ఉద్యమ సంబంధం, భారతీయ కమ్యూనిస్టు పార్టీతో ఉన్న అనుబంధం మిగిలిన కవులకు లేదు. ఆ మాటకొస్తే ఏ కొద్దిమందినో మినహాయిస్తే ఈ దశాబ్దంలోని కవులకు రాజకీయాలతో గానీ, రాజకీయ, సామాజిక ఉద్యమాలలో గానీ ప్రత్యక్ష సంబంధం లేదు. ఒక స్థూల అవగాహన మాత్రం వీరికుంది. అలాగే అంతకు ముందటి దశాబ్దంలోని సామాజిక పరిస్థితుల ప్రాబల్యం, ఆనాటి సామాజిక జీవితానుభవం వీరికి ఉంది.

సామాజిక విషయాల పట్ల ఉన్న అవగాహన, రాజకీయ విషయాల పట్ల లేనందువల్లనే సుప్రసన్న 'మృత్యుమూర్తి; మాదిరాజు రంగారావు 'శ్వేతేతర విహంగాలు' లాంటి కవితలు రాశారు. ఒకవేళ రాజకీయ అవగాహన ఉందనుకున్నా అది వైముఖ్యం వైపే మొగ్గింది. 'మృత్యుమూర్తి' నూట పన్నెండు పంక్తులకు విస్తరించిన కవిత. మానవుడు ఎదుర్కొనే అంతిమ వాస్తవం గురించి చేసిన విచారణ, తాత్విక చింతన ఈ రెండూ ప్రధానంగా కనిపిస్తాయి ఇందులో. 'శ్వేతేతర విహంగాలు' శాంతిని కాంక్షించే కవి అంత శ్వేతనను తెలుపుతుంది. శాంతికాముకం కానీ అన్ని రకాల దృక్పథాలను కవి కాదంటాడు. ఒక రకంగా ఇది వామపక్ష సిద్ధాంతాలను నిరసించడం. అదే విధంగా ప్రపంచశాంతికి భంగకరమయ్యే రాజకీయ శక్తులు, సిద్ధాంతాలు కవికి సమ్మతం కావు. వీటినే ప్రధానీకరించాడు కవి. అంటే వచన కవిత్వం తొలి దశాబ్దంలోనే ఒకవైపు రూపాన్వేషణ, స్థిరీకరణ జరుగుతూ మరోవైపు దృక్పథం కోసం చేస్తున్న ప్రయత్నం కూడా కనిపిస్తుంది. ఈ దృక్పథాన్వేషణా యత్నం 1970ల నాటిగ్గాని సఫలం కాలేదు.

తెలంగాణాలో వచన కవిత్వం ఒక ప్రక్రియగా రూపుదిద్దుకునే ప్రయత్నం చేస్తున్న దశకంలోనే 'తెలుగు స్వతంత్ర' కవులను ప్రోత్సహించటం మొదలుపెట్టింది. శ్రీశ్రీ, ఆరుద్రలాంటి కవుల రచనలను ప్రచురించినట్లుగానే, సుప్రసన్న, రంగారావు, చేరా తదితరుల రచనలను ప్రచురించింది. కవులుగా తెలంగాణా ప్రాంతానికి చెందిన వారే అయినా వీరిమీద ఆ ఉద్యమ ప్రభావం స్వల్పం. పరోక్షం కూడా. పోరాటం జరిగిన ప్రాంతంలో ఉండినప్పటికీ పోరాట రాజకీయాలను, ఉద్యమాలను వాటి వెలుపలనుండి గమనించటం వల్ల వీరు రాసిన కవిత్వం సామాజిక చైతన్యంతో రాసిందే తప్ప రాజకీయ చైతన్యంతో రాసింది కాదు. రాజకీయాల మీదా, రాజకీయ పరిణామాల మీద వ్యాఖ్య అరుదుగా ఎక్కడైనా కనిపిస్తే కనిపించవచ్చు. చేరాలాంటి కవులు 'రెండు పదులపైన' సంపుటి మాత్రాచ్ఛందస్సును బలంగా పట్టుకుంది. భావకవుల ప్రభావం పద్యాల్లోకి పద్యరచనలోకి దారితీయకుండా గేయాల్లోకి మళ్ళింది. అప్పటికి భావ కవిత్వం తెలంగాణేతర ప్రాంతాల్లో అవశేషంగానే మిగిలి ఉంది. ఆ మాటకొస్తే అభ్యుదయ కవిత్వమే అవశేషంగా మిగిలే స్థితికొచ్చింది. కనుక కవి భావకవిత్వం వైపు దృష్టిమళ్ళించాడు.

(సశేషం)

# బేతవోలు పద్యానుసృజన: 'నల్లరాతి గుడి'

– గాలి నాసర రెడ్డి

బేతవోలు రామబ్రహ్మం ఆధునిక భారతీయ భాషా కవితలను కొన్నింటిని ఆంగ్లానువాదాల ద్వారా ఛందోబద్ధంగా తెలిగించి వెలువరించిన పుస్తకం 'పలుకు చిలుక' (అక్టోబర్, 1996). ఈ పుస్తకంలోని ఒక అనువాద కవిత 'నల్లరాతి గుడి'ని, దానికి ఆధారమైన ఆంగ్లానువాదం "The Black Pagoda' తో పోల్చి చూపడం కోసమే ఈ వ్యాసం.

ఒరియా కవి రమేష్ ప్రతాప్ (జ. 1956) కవితకు ఒరియా, ఆంగ్ల భాషల్లో విఖ్యాతుడైన కవి జయంత మహాపాత్ర (జ. 1928) చేసిన ఆంగ్లానువాదం "The Black Pagoda' ఇది సాహిత్య అకాడెమి వారి ద్వైమాసిక "Indian Literature' (No.158; నవంబర్, డిసెంబర్, 1993)లో ప్రచురితమైంది.

క్రీ.శ.13వ శతాబ్దంలో శిల్పకళాభిరామంగా నిర్మితమై, ప్రస్తుతం శిథిలావస్థలో ఉన్న కోణార్క-దేవాలయమే నల్లరాతిగుడి. ఈ విషయం తెలియకపోయినా ఈ కవితను అనువదించడంలో ఇబ్బంది లేదు.

కవితలోని మొదటి స్టాంజా:

Like a raped - mute woman

is this poem in stone.

"This poem in stone' అనే భావచిత్రం నల్లరాతి గుడి ఎంత మనోజ్ఞంగా నిర్మితమైందో తెలుపుతుండగా, "raped - mute woman' అనే ఉపమానం గుడి ప్రస్తుత దుస్థితిని వ్యక్తం చేస్తోంది. శక్తి మంతమైన ఈ పంక్తులకు బేతవోలు అనువాదం:

మానభంగమ్మునకు గురియైన మూగ

పిల్లవోలిక - నిన్ను నేడ్పించునేమొ!

సగము చెక్కిన శిల్పమ్ము పగిది - నాదు

పద్య మియ్యది నిన్ను రాపాడునేమొ!

మొదటి ఉపమానం మినహా మిగిలిన తెలుగు అనువాదానికి ఆంగ్లానువాదంతో ఎటువంటి సంబంధం లేదు. 'నాదు పద్యమియ్యది' వర్ణ్యవస్తువు కావడం చిత్రంగా ఉంది. ఇలా తెలిగించడంలోని ఔచిత్యమేమిటో బేతవోలు చెప్పవలసిందే!

రెండో స్టాంజా:

A leper woman
shoos off the flies from her sores.
A naked boy begs
And a tourist

records the portrait of hunger

on his camera film.

దేవాలయ పరిసరాలలోని మూడు యథార్థదృశ్యాలు ఇందులో ప్రదర్శితమయ్యాయి. దీనికి బేతవోలు అనువాదం:

ముసరుకొనుచున్న ఈగల కసరి కసరి

మొండి చేతుల నిటునటు చెండుచుండె

కుష్ఠరోగిణి, ఇటు చూడు - కుఱ్రకుంక

దిప్పమొలవాడు జనముల దేబిరించు.

అడిగొ పరదేశి, యాత్రా విహారశీలి -

కరవుబోసిన ఆకలి నరసి యరసి

బొమ్మలను తీయుచున్నాడు - భూతలాన

నెల్లవారికిఁ జూపించి యెరుక పరుప.

ఆంగ్లానువాదంలోని విషయాలన్నీ తెలుగులోకి వచ్చాయి. అయితే కొంచెం విస్తరణ పొందాయి. ఉదాహరణకు, యాత్రికుడు చేస్తున్న పని మాత్రమే ఆంగ్లంలో ఉండగా, బేతవోలు 'భూతలాన నెల్లవారికిఁజూపించి యెరుక పరుప' అని ఒక ఉద్దేశం కల్పించారు. 'భూతలాన' పదప్రయోగాన్ని బట్టి ఈ విస్తరణ కొంత పద్యపూరణ కోసం జరిగినట్టు గమనించవచ్చు. అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు (1889-1942) తమ గ్రంథం 'నేటి కాలపు కవిత్వం'లో కవిత్వంలో కనిపించే వ్యర్థపదాలను కొన్ని గణాలుగా విభజించారు. ఆ ప్రకారం చూస్తే ఈ 'భూతలాన' అనే పదం భూమి గణానికిచెందుతుంది. (దండ్గగణానికిచెందినపదాలు కూడా 'పలుకు చిలుక'లో ఎక్కువగానే ఉన్నాయి - లలిన్, ఓలిన్, రమణన్, అరయగ, అనువుగ, పన్నుగ, క్రన్నన, చయ్యన మొదలైనవి.)

మూడో స్టాంజా:

In a suite

beside the nearby caruarinas

a girl unbuttons her dress

గుడి సమీపంలోని సరుగుడు చెట్ల పక్కన గల యాత్రిక నిలయంలో ఒక యువతి బట్టలు విప్పేయడం - ఇది దేన్ని సూచిస్తుంది? పాఠకుడు ఊహించుకోవలసిందే. (అక్కడ జరిగే వ్యభిచారానికి సూచన అని కవి రమేష్‌ప్రతాప్ 11-7-97 నాడు నాకు రాసిన లేఖలో తెలిపారు.) అయితే ఈ ఊహకు ఆస్కారం లేకుండా బేతవోలు అనువదించారు. చూడండి:

పంచతారాతిథేయ సౌధాంచలాన

కృత్రిమానేక కిరణ సంసృష్టి నడుమ
యువతి యొక్కతె వలువల నూడ్చుచుండె
వాద్యఘోషకు ననువైన భంగిమముల.

బేతవోలు కేబరే డ్యాన్సుగా అర్థం చేసుకున్నట్టున్నారు. అందుకు అనుగుణంగా 'in a suite' ను 'పంచతారాతిథేయ సౌధాంచలాన' అని తెలిగించారు; తేటగీతిలోని 2,4 పాదాలను అదనంగా చేర్చారు; దేవాలయ పరిసరాలలో భాగమైన సరుగుడు చెట్లను అదృశ్యం చేశారు.

ఇక నాలుగో (చివరి) స్టాంజా:

From the wounds of the setting sun
a little blood
drips onto the breasts of the stone dancer

నల్లరాతిగుడి దుస్థితి ( బహుశా, ఇలాంటి అమూల్యకళానిధులైన పురాతన నిర్మాణాల పట్ల మనం ప్రదర్శిస్తున్న నిర్లక్ష్య వైఖరి కూడా) కవిలో కలిగించిన తీవ్రవేదనే ఈ భావచిత్రం ఇలా బీభత్సంగా రూపొందడానికి కారణమనుకుంటాను. బేతవోలు అనువాదం:

అస్తమించెడు సూర్య్య గాయముల నుండి
చిందివచ్చిన నెత్తురు బిందువొకటి
ఈ శిలామయనర్తకీ పృథుల కుచత
టాగ్రమున రాలి జరిపె నభ్యంగనదిమ్ము

తెలుగు సేతలో చేరిన అభ్యంగన ప్రక్రియ ఈ భావచిత్రానికి తగినది కాదు.

'' ఇవ్వి అనువాదాలు కావు. అనుసృసజనలు. అందుకే భారతభారతికి సంకేతంగా 'పలుకు చిలుక' అనడం. వీటిలో 'అవిధేయత' కొంత ఉంటుంది. అక్కడక్కడా లోపపూర్తి కోసం చేసిన కొత్త అందాలూ కొన్ని ఉంటాయి. అసలు - కవిత్వానికి అనుసృజన ఒక్కటే సరయిన మార్గమని నా అభిప్రాయం కూడా'' అని బేతవోలు రామబ్రహ్మం తమ ముందుమాటలో చెప్పుకున్నారు.

కవితకు సరిగా అనువాదం చేయగలిగితే అదే అనుసృజన అనిపించుకుంటుంది, అనుసృజన అని ప్రత్యేకంగా చెప్పుకోకపోయినా. దీనికి 'అవిధేయత' ఎక్కడైనా అవసరమైతే కావచ్చు. అంతేగాని, అనుసృజన పేరుతో స్వీయకవితా ప్రదర్శన చేయడం మూలరచనకు అన్యాయం చేయడమే అవుతుంది. కవిగా, అనువాదకునిగానే కాదు, పాఠకునిగా కూడా నేను ఇలాగే భావిస్తాను.

ఇంతకు ఈ పద్యానుసృజన 'నల్లరాతి గుడి' లోని 'అవిధేయత' అధికభాగం కవితను సరిగా గ్రహించకపోవడం వల్లా, పద్యపూరణావసరం వల్లా కలిగిందే అని చెప్పవచ్చు.



విజ్ఞాన సమన్వయ గ్రంథకర్త

**హెరాల్డ్ విల్సన్**

MISIMI/మిసిమి RNI Regd No 45042/90 Telugu Monthly, Hyderabad-500 020 Postal Regd No H/SD/191



**'నేను - నా అవ్వ'**

చిత్రకారిణి రష్మిమాలా దేవి. ఈమె అస్సాంకు చెందిన ఫెమినిస్ట్ భావాలు బలంగా ఉన్న యువ చిత్ర కారిణి. ఈ చిత్రంలో అనుబంధాలకు సంకేతమైన సున్నిత భావాలను ప్రతిబింబంగా చిత్రీకరించింది.